# సావిత్రి

నాటకము

ప్రకాశకః:

రంగా కిష్టమ్మగారి కుమారుడు

వేంకటరత్నము,

బుక్ సెల్లర్ అండ్ పబ్లిషర్,

బెజవాడ.

కాకినాడ

ఆల్బర్టు పవర్ ప్రింటింగ్ వర్క్సు, యందు

ముద్రింపఁబడియె.

1927.

# ఆంధ్ర నాటకములు.

| | | | |
|---|---|---|---|
| సంపూర్ణరామాయణము గూ. కో. | 1-4-0 | శ్రీరామవిజయము | 0-8-0 |
| సంపూర్ణోత్తరరామాయణం నారా | 1-4-0 | శ్రీరామాశ్వమేధము | 0-8-0 |
| సంపూర్ణభారతము | 1-4-0 | ఉషాపరిణయము | 0-8-0 |
| తారాచంద్రీయం కా|| వీ|| | 0-12-0 | చంద్రకాంత చ. మా. | 0-10-0 |
| రసపుత్రవిజయం ఇ|| య|| | 1-0-0 | కన్యకాపరమేశ్వరీవిలాసం | 1-0-0 |
| శారదావిజయం కో|| వీ|| | 0-12-0 | సంగీతశశిరేఖ ఆ. చం | 0-12-0 |
| మాళవి | 0-12-0 | సతీతులసీ దో|| సీ|| | 1-4-0 |
| సత్యాబాయి జ|| ల|| | 0-12-0 | జయంతజయపాల బ. కో. | 0-8-0 |
| భీమప్రతిజ్ఞ క|| కో|| | 0-12-0 | కుశలవపట్టాభిషేకం రా. నా. | 0-12-0 |
| కబీరదాసీయము శ|| రా|| | 0-12-0 | మహానంద పుం. శ. | 1 0 0 |
| సారంగధర వి|| సు|| | 0-12-0 | సత్యహరిశ్చంద్ర రా. నా. | 0-12-0 |
| కుశలవ డిటో | 0-12-0 | సంపూర్ణరామాయణం న. గో. | 1-4-0 |
| చతురచంద్రహాస | 0-8-0 | సావిత్రి దో. సీ. | 0-12-0 |
| తులసీదాసు కో|| న|| | 1-0-0 | పాదుకాపట్టాభిషేకం కో. న. | 0 12-0 |
| భక్తకబీర్ | 1-0-0 | మారుతీవిజయం గూ. కో. | 0-12-0 |
| లంకాదహనము శ|| య|| | 1-0-0 | సుమతీదేవి బ. కో. | 0-12-0 |
| సారంగధర | 1-0-0 | సువర్ణపాత్రి రా. నా. | 1-0-0 |
| జయంతజయపాల | 0-2-0 | కనకతారనాటకము చం. కే | 1-0-0 |
| మైరావణవధ | 0-1-0 | సంగీతకృష్ణలీల న. శం | 1-0-0 |
| తారాబాయి | 0-1-0 | సంగీతవిష్ణులీల చ. మా. | 1-0-0 |
| సతీసావిత్రి | 0-12-0 | సంగీతగులేబకావళి డిటో | 1-0-0 |
| రాధాకృష్ణ పా. ల. | 0-10-0 | బిల్వమంగళ చింతామణి | [illegible] |
| పద్మవ్యూహము కా. నా. | 1-0-0 | సంగీతలంకాదహనం దో. సీ. | 0-10-0 |
| చింతామణి కా. నా. | 1-2-0 | పాదుకాపట్టాభిషేకం | 0-12-0 |
| పత్రినలీయము ధ. కృ. | 1-6-0 | వేశ్యాహితబోధిని | 1-0-0 |
| విషాదసారంగధర | 1-6-0 | వేశ్యామధురం పా III | 0-8-0 |
| ప్రహ్లాద | 1-4-0 | భక్తరామదాసు కే. శ. | 1-0-0 |
| పాదుకాపట్టాభిషేకము | 1-4-0 | పాంచాలీమానసంరక్షణం కే. రా. | 1-4-0 |
| చంద్రహాస | 1-4-0 | సంగీతమార్కండేయ | 0-12-0 |
| శ్రీరామజననము దో|| సీ|| | 0-8-0 | పాండవజననము రా నా. | 0-10-0 |
| శ్రీరామప్రవాస ము | 0-8-0 | పాండవప్రవాసము డిటో | 0-12-0 |
| శ్రీరామోద్యోగ ము | 0-8-0 | పాండవోద్యోగము డిటో | 0-12-0 |

రంగా వెంకటరత్నం,

బుక్కు-సెల్లర్సు, బెజవాడ.

శ్రీ

# సావిత్రి నాటకము

4 అంకముల నాటకము.



పండిత ద్రోణంరాజు సీతారామ విరచితము.




బెజవాడ బుక్కుసెల్లర్సు

రంగా వెంకటరత్నముచే

ప్రకటింపబడియె

ఏడవకూర్పు 2000.

జయంతి జగన్నాథశాస్త్రిగారిచే

కాకినాడ ఆల్బర్టు పవర్ ప్రింటింగ్ వర్క్సు, యందు

ముద్రింపఁబడియె.

1927.


Registered Copy-right] [వెల రు 1—0—0.

# పీఠిక

ఆంధ్రమహాజనుల యాదరణమున నీనాటకము ఆరవ కూర్పుపడు భాగ్యము లభించినది. అయిదవ కూర్పున నింతకుమున్ను లేని కొన్నిరంగములును, ప్రకటనకర్త కోరగా మఱికొన్ని కీర్తనలును చేర్చినాను. ప్రదర్శకులుగాని, చదువరులుగాని, మఱేమైన వలసిన మార్పులంగూర్చి దయతో తెలిపినచో ముందుకూర్పునందు చేయుటకు బ్రయత్నించెద.

గుంటూరు,
1-8-25.

ఇట్లు
గ్రంథకర్త.

మొదటికూర్పు—3000

రెండవకూర్పు—1000

మూడవకూర్పు—1000

నాలుగవకూర్పు—2000

అయిదవకూర్పు—1000

ఆరవకూర్పు—1000

ఏడవకూర్పు— 2000

# ఈనాటకమునందు వచ్చు పాత్రలు



## పురుషులు

ద్యుమత్సేనుఁడు:— సాళ్వదేశపురాజు.
విశారదుఁడు:— మంత్రి.
చిత్రకేతుఁడు:— ద్యుమత్సేనుని శత్రువు.
సత్యవంతుఁడు:— ద్యుమత్సేనుని కొడుకు-కథానాయకుఁడు.
అశ్వపతి:— మద్రరాజు.
నారదుఁడు:— ముని.
యముఁడు.
చిత్రగుప్తులు.
సుశర్మ:— సత్యవంతునిహితుఁడు.

## స్త్రీలు

సావిత్రి:— మద్రరాజపుత్రి (కథానాయకి)
భద్రాంగి:— ద్యుమత్సేనుని భార్య.
నర్మద:— సావిత్రి చెలికత్తె.





# సావిత్రి నాటకము.

## ప్రథమాంకము.

రంగము—సాళ్వపురము

[ప్రవేశము:—చిత్రకేతుడు]

చిత్ర—(స్వగతము) ద్యుమత్సేనుని సైన్య మల్పసంఖ్యగలదై యుండి
నను నా సేనతోఁ గడుధైర్యమున వెన్నిడక పోరాడుచున్నది.
(ఎదుటఁజూచి) ఏదియో కోలాహలము వినవచ్చుచున్నది.
మా సేనలకేమియు హానివాటిల్లి యుండదుకదా! (బిగ్గరగా)
ఓహో! సేనానాయకులారా!

ఉ. మనమున నించుకేని యను • మానముఁబూనక శత్రువర్గముం
దునిమి ధరాతలంబునను • దోరపుఁగీర్తిఁ గొనంగ సాళ్వనా
థుని మదినున్న గర్వమును • ద్రొక్కుడు (ఎదుటఁజూచి)

అదిగో! సాళ్వసైన్యములన్నియు నలుదెసలఁ బఱుగిడుచున్నవి.
ఈసమయమున ద్యుమత్సేనుఁ డెక్కడికైనఁ బలాయితుండగునేమో.
అట్లయిన నా కీవిజయమువలన సంతోషమంతయెక్కుడుగనుండదు!

(సేనలవంకఁజూచి)

వీరవరేణ్యులార! యా
జనపతి నెట్టులైనఁ గను • సాహసమేర్పడఁ బట్టి తెండిటన్.

(పరికించి) ఆహా! ఏమి! నా సేనాధీశుని శౌర్యము! వర్ణనాతీతమై యున్నది. నా యాజ్ఞకు పూర్వమే యాతఁడు ద్యుమత్సేనుని

బంధించి యిట్లు దోడ్కొనివచ్చుచున్నాఁడు. సేనాపతీ! మేలు. మేలు. యద్వితీయమైన రాజభక్తికి సంతసించితిని.

[బంధింపఁబడిన ద్యుమత్సేనునితో సేనానాయకుఁడు ప్రవేశించును]

సేనా—(చిత్రకేతునిఁ జూచి) దేవా! దేవరవారి వైరియగు ద్యుమత్సేన మహారాజితఁడే.

చిత్ర—దండనాయకా! ఇంకను నీతని కా మహారాజ శబ్దమేల?

ద్యు—(తనలో) ఆహా! కాలమహిమ! (పరమేశ్వరుని నుద్దేశించి)

మ. చతురంభోధిపరీత భూతలము నా • సామ్రాజ్యభారంబు నా
యతబాహాయుగళంబునన్ నిలిపి ధ • ర్మైకస్థితిం బ్రోవు భూ
పతి నీరీతిఁ జేసి యొక్కరుఁడు దే • బంధింపఁగా జేసితే
యతిచిత్రంబులు నీదు లీలలు గదా • హా! సర్వలోకేశ్వరా!

ఓ దేవా! యెట్లనుభవింపవలయునో నా బ్రహ్మ వ్రాసియుండునో యట్లు దప్పదుగదా. నన్ను బంధించుటకై పంపియున్న నింతగా విచారింపను.

చిత్ర—(ద్యుమత్సేనునిఁ జూచి) ఓహో ద్యుమత్సేనుఁడవేమి? ఈ చిత్రకేతుని బలమెట్టిదో యిప్పటికైనఁ దెలిసినదా! నీ గర్వము తలయు నడఁగినదా! ఇంతకు మున్ను రాజ్యమదాంధత్వమున నన్నుఁ దృణప్రాయునిగఁ జూచితివే. ఇప్పుడు నీ కడ్డమయినవారెవ్వరు?

ద్యు—ఓరీ! చిత్రకేతూ! ఏల యీలీల గర్వాలాపము లాడెదవు? రణంబున జయాపజయములు దైవాధీనములు మా సేనలన్నియు సిద్ధము లేని సమయమున దస్కరునివలె వచ్చి పురముము ట్టడించిన నదియు నొక శౌర్యమేనా! నీచే జిక్కిన కారణమున నెట్టి మాటలనైన నాడుదవు. పోటుమానిసివేని నీవు నాతో యుద్ధమొనర్పుము. నీ నా బలంబులు దెలియును?

శత్రు—(ద్యుమత్సేనునిఁజూచి) ఈ నీతో నవసర సంభాషణతో మాకే మియుఁ బనిలేదు. నీరాజ్యము మావశమైనది. ఇంక నీవిందుండఁ జనదు. నేఁడే నీవు సతీసుతసమేతుఁడవై పురము విడచి పోవలయును. తెలిసినదా! (సేనాపతిం జూచి) సేనాపతీ! ఈతని బంధముల విడిచి, యీతనిఁ బురినుండి వెడల నంపు ప్రయత్నమున నుండుము. పొమ్ము. (నిష్క్రమించును.)

ద్యు—(తనలో) అక్కటా! విధాత నాకెట్టిసంకల్పము గల్పించినాఁడు! నిన్న నేఁటివఱకు మహాసంపదల ననుభవించుచు, సకలసౌఖ్యముల నందుచున్న నేను, ప్రజలనందఱఁ గన్నబిడ్డలచందమున నరయుచు ధర్మపరిపాలన మాచరించుచున్న నేను, సత్యసంధుఁడనని యు దా[illegible]రేయుఁడననియు కీర్తిఁగొన్న నేను, ఈరాజ్యము విడిచి యరణ్యముల కాలుబిడ్డలతోఁ బోవలసినదేనా? హా! సాళ్వపుర రాజ్యలక్ష్మీ! లక్ష్మి చంచలచిత్తయనుమాట నేఁడు సత్యమైనది. కానిచోఁ గ్రూరాత్ముఁడగు శత్రురాజుం జేరుదువా? నేను [illegible]వలసివచ్చినను సంగతి దెలిసినచో నిరంతరమును ననేక పరిచారికాపరివృతయై యుండు నా యర్ధాంగియు, నెన్నఁడును గ్రింద కాలు బెట్టి యెఱుంగని నా చిన్ని కొమారుఁడగు సత్యవంతుఁడును నింతగాఁ బరితపింతురో కదా! ఆహా! ఎంతకష్టము సంభవించినది!

(నిష్క్రమించును.)

---

రంగము:—అరణ్యము—[అశ్వపతి ప్రవేశము.]

అశ్వ—(తనలో)

మ॥ అతినిష్ఠన్ దపమాచరించితిఁ బలో • కారాధ్యుసంతుష్టిస
ద్వ్రతముల్ పెక్కొనరించితిన్ జపములన్ • రాజిల్లగా సల్పితిన్
గ్రతువుల్ జేసితి నెన్నియో భువిని నే • నాసంగ లేకుంటి స
త్సుతు, నాపాప మదేమొగాని యకటా! • శోకింతు నిర్దానినై

నేను జేసిన పుణ్యములన్నియు నేల పాలయినవి. (ఇంచుక యూరకుండి) ఇప్పుడు నేను విచారించినందువలనఁ బ్రయోజనమేమి యున్నది? లోకమాతయగు సావిత్రింగూర్చి తపము నర్పెదగాక!

(కనులుమూసికొని జపము జేయుచున్నాడు.)

(సావిత్రి—ప్రత్యక్షమగును.)

సావి—(అశ్వపతియెదుట నిలిచి) రాజా! నీతపోనిష్ఠకు నే నెంతయు సంతసించితిని. నలయు వరమొసఁగెద కోరుము.

అశ్వ—(కనులు దెరచి చూచి) తల్లీ! సావిత్రీమహాదేవీ! నీదివ్య మంగళవిగ్రహసందర్శనమున నేను కృతార్థుడనైతిని.

సీ॥ పరమసౌఖ్యప్రాప్తి • పరతారకాగణం
బుసకు సుతుఁడేకదా • వనజవైరి
బహుఘోర సంసార • వారాశి దరియింప
జేయు పుత్రుఁడె కదా • చెలగు నౌక
శ్రీముక్తినామక • సీమంతినింగూర్ప
తనయుఁడేకద తగు • తార్పులాడు
సద్వంశపరకీర్తి • శాఖలు వెలయింప
బుత్రుడేకద మేటి • భూరుహంబు

తే॥ గీ॥ పుత్రుఁడేకద సుఖముల • మూలమరయ
నాత్మజుడెగదా దురిత ల • తా లవిత్రు
డట్టి పుత్రుండు పుట్టలే • దంచు మిగుల
వగలఁ బొగులుచుంటిని నేను • భావమందు॥

చ॥ ఎంతధనాఢ్యుఁడైనను మ • రెంతగ భూవలయంబు నేలినన్
సంతతి లేనిచో నతని • జన్మ నిరర్థకమంచు నేనిదే
స్వాంతమునందు నీచరణ • పద్మములన్ నెరనమ్మినాను నా
వంతను మాన్చి సంతతి న • పారకృపామతి నిచ్చి బ్రోవుమా॥

సావి—నరపాలా! నీ యభీష్టము సిద్ధించుగాక! నీకొక పుత్రికారత్న
ముదయించి సావిత్రియనుపేర వర్ధిల్లు. ఆ సువలన నీ చింత
యంతయు దీరును. (అంతర్ధానమగును.)

అశ్వ—(తనలో) జగజ్జనని వచించినపలుకులకు నాస్వాంతమునసంతో
షము కలిగినది. (నిష్క్రమించును).

---

రంగము:—(ఆమందిరములో అశ్వపతి సావిత్రిని
ముద్దాడుచుఁ బ్రవేశించును)

అశ్వ—ఆహా! నేనిప్పటికి సార్థకజీవుడనైతిని.

తే॥ గీ॥ సంతతిమొదన లేకంమ • స్వాంతమందు
పొగిలి పొగిలి పురాకృత • పుణ్యమునను
నేల నేటికి నొకసువు • తీరు లలామ
గాంచినాడను సావిత్రి • కరుణచేత॥

ఇకనీమె దినదిన ప్రవర్ధమానయై తగినవరుని చేపట్టి, సుఖించు
చుండఁజూచి యానందించు భాగ్యమెప్పుడు వచ్చునో కదా! (ఎదుట
జూచి) బాలికామణిం గైకొనుము. (నిష్క్రమించును.)

---

రంగము—(వింధ్యారణ్యప్రదేశమునం దొకవనము. సావిత్రియు
చెలికత్తెయగు నర్మదయు బ్రవేశించుచున్నారు.)

సావి—చెలీ! ఎందుకీ వేళాకోళపు మాటలు? దీనివలనఁ బ్రయో
జనమేమియున్నది?

నర్మ—నావి వేళాకోళములా! నేను వివాహమునుగూర్చి ముచ్చటిం
చుట తప్పా! నీతండ్రిగారు నానా రాజకుమారుల చిత్రపట
ములను దెప్పించి నీకుఁ జూపించెను. అందెవ్వరిని వరింపక
యుంటి వేమికారణము?

సావి—నాచిత్త మెవ్వరిపైనను బోలక యుండుటయే దానికి గారణము.

నర్మ—ప్రపంచములో నెక్కడను లేని రాజకుమారుడు వచ్చి నిన్ను వరించునని యా నీయభిప్రాయము.

సావి—వెఱ్ఱిదానా! ఈశరీర మెవరికొఱకై సృష్టింపబడినదో యెవరు జెప్పగలరు.

నర్మ—నీవెంత చిత్రముగ మాటలాడెదవు! (ఇందుకయ్యూరకుండి) చెలీ! మద్రరాజదుహితా! రాత్రి నీవుగన్న కల నాకెఱిగింప వైతివికదా! అది వినిపించినంత మాత్రమున నే నీ నో రరిగి పోవునా యేమి! ప్రాణసఖినగు నాయొద్దగూడ దాపరికమా!

సావి—నర్మదా! నీయొద్ద నెప్పుడైన నేసంగతినైనఁ దాచితినా?

నర్మ—అట్లయిన వినిపించుట కీసంశయము మేల?

సావి—నాకేమియు సంశయము లేదు. వినుము. నిన్న రేయి భోజనానంతరమున మాయమ్మగారితో నేదియో సంభాషించుచు గొంతసేపు కూర్చుంటి. యనంతరము నిద్రాదేవతచే నాకర్షింపఁబడుటచే దల్పమునఁ బరుండి యిష్టదేవతను స్మరించుచు నిద్రను నింగితిని. అప్పుడు నా స్వప్నమునఁ నొక రాజకుమారుడు—

(సంశయించును)

నర్మ—సంశయించెద వేల? ఇందన్యులెవ్వరును లేరు?

సావి—నన్నేల యీరీతి బలవంతపెట్టెదవు? అయ్యో!

(నిట్టూర్పు విడుచును)

నర్మ—ఆకలసంగతి జ్ఞప్తికి రాగానే నీకు దాపము గలుగుచున్నదే, అట్లయిన నదిసామాన్యమైన కలగాదు. వినవలసినదే. సఖీమణీ! సిగ్గుపొందక చెప్పుము.

సావి—అబ్బబ్బా! ఏమి యీబలవంతము! చెప్పెదను వినుము.

సీ॥ పూర్ణేందుబింబంబు • బోలు మొగమువాఁడు
కంజాతములనేలు • కనులవాఁడు
వజ్రపంజరనిభ • వక్షస్థలమువాఁడు
చిరునవ్వు మోమున • జెలఁగువాఁడు
కమనీయసౌందర్య • కంబుకంఠమువాఁడు
గరుణార్ద్రహృదయుఁడై • గ్రాలువాఁడు
గర్వమింతయు లేక • కానిపించెడువాఁడు
భానుదీప్తి నిమించి • బఱఁగువాఁడు
తే॥ గీ॥ నొక్క చేతను బట్టె, మ • ఱొక్క చేతఁ
దాల్చి ధరించి రాజసం • దనరుచున్న
మునికుమారుని భంగిని • బొల్చువాఁడు
సజ్జనుండొకఁడు నాకు సా • క్షాత్కరించె॥

నర్మ—అందుకనే కలఁగనిన నాఁటనుండియును నీచిత్త మతనియొక్క విధమున మారిపోయినది.

పావ—అతనిం గనుంగొని నసేత్రిదూ భాషింపఁ బ్రయత్నించుచుండఁగనే యాదివ్యమంగళ విగ్రహుండదృశ్యుఁడయ్యెను. చెలీ! నీవు ప్రాణసఖివి గావునఁ జెప్పుచుంటిని. అట్టి జగన్మోహనాకారు నే నెందును జూచియుండలేదు సుమా! పేరేమో! నా చిత్తము తదాయత్తమైనది. నా మనోరథ మంతయు నాతని వశమైనది. (ఇంచుక యూరకుండి) అమ్మా! నిట్టూర్పు విడుచును)

నర్మ—చెలీ! నీ వెంతటి బేలవు! ఎవ్వనినో యొక్కనిని గలలో జూచి వానికై భ్రమఁజెందుచుంటివా! ఎవ్వరైన విన్న నవ్వుదురు. నీతండ్రి యనేక రాజ్యకుమారుల చిత్రపటములఁ దెప్పించి నీకు జూపించెను. అందెవ్వరును నీకుఁ దగియుండలేదు. నీకలలో జూచినపురుషుండరుదెంచి నిన్ను వివాహమాడుననియా నీయాన ?

పావ—నర్మదా! పోనిమ్ము. ఆసంగతి యిప్పుడేల? భగవదాజ్ఞ యెట్లున్న

నట్లగును. మాయమ్మగారు మనకై వేచి యుందు రేమో! త్వరగాఁ బోవుదమా?

నర్మ—మన మిప్పుడే కదా వచ్చితిమి. ఇంతలో దత్తరమందెద వేల?

మ॥ అదియే వింధ్యవనంబు, నల్లదె ప్రియో, ద్యానం,బదే చూడుమీ
కదళీవాటి, యవే మహీజవితతుల్, • కల్హార నీరేజనం
పద రాజిల్లెడు కేళికాసర మదే • వల్లీమతల్లీవశం
వధకుంజంబు లవే గనన్ నయనప • ర్వంబుల్ బొనర్చున్ సఖీ॥

కావున నించుకసేపచ్చట విశ్రమించి యరుగుదము. రమ్ము.
(చేయిబట్టుకొని కొంతదూరము దీసికొనిపోవును)

సావి—సఖీ! నర్మదా! ఆహా! ఈవనరామణీయత యెంత స్వాభావిక ముగనున్నదీ! ఇందలి వృక్షపంక్తుల మీదుగా వీచుచున్న యీ మందమలయానిలము డెందముల కెంత యానందము గొలుపుచున్నదో!

నర్మ—ఈవనలక్ష్మి మనయెడల గౌరవముజూపుటకై మనమాసీనుల మగుట కేర్పరచిన రత్న కంబళములో యనునటు పచ్చిక బయలు నదిలకింపుము.

(సత్యవంతుఁడు ప్రవేశము)

సత్య—(తనలో) ఆహా! ఆ వ్యాఘ్రము నన్నెంతలో గన్నుఁ గప్పి యిట్లు పరుగెత్తుకొని వచ్చినది. బాల్యము నుండియు నాచేతఁ బెంపబడుచుండు నా ముద్దులేడిని వ్యాఘ్రమిథున మొండు దరుముకొనిరాగ నయ్యది భయముచే బరుగెత్తుకొని వచ్చి నా వెనుక జేరెను. దానిభయమునకుఁ గారణ మేమైయుండునా యని యిటు నటు పరికించునప్పటికి నాకంటికి రెండు పులులు దానిదఱుముకొనివచ్చుట గోచరమయ్యె. వెంటనే హరిణమును గట్టివేసి యాశ్రమములోనికరిగి విల్లందుకొని యిట్లువచ్చి యాడుపులిని మాత్రము వధింపగలిగితిని. తక్కినమాత్రము

నావింటిదెబ్బకు నండక యిట్లు పరుగిడి వచ్చి యేపొదయందో దాగి యున్నది. కానిమ్ము. దీనిఁగూడ వధింపలేక యుందునా. ఏపొదయందు దాగియున్నదో తగు జాగరూకతతో నరసెదఁగాక! (ఇంచుక ముందుకు నడచి, సావిత్రీ నర్మదలను జూచి) ఆహా! ఊ యువతీమణు లెవ్వరు? వీరి యపూర్వ సౌందర్య తేజముచే వనమంతయుఁ బ్రతిఫలింపఁ జేయుచున్నవే!

మ॥ సురనారీమణులో, భుజంగసతులో • క్షోణీశశుద్ధాంత సుం
దరులో, గారుడవంశకన్యకలో, గం • ధర్వాంగన శ్రేష్ఠలో
వరవిద్యాధరవంశసంభవులో, రం • భామేనకా కాంతలో
నరిరారెవ్వరు వీరికిన్ శుభవిలా • సఖ్యాతిసౌభాగ్యలక్ష్మీక్

(పరికించి) ఇందుఁ గుడిచేయి ప్రక్కగానున్న యువిద యొక రాజపుత్రి యనియు, రెండవకాంత యామె చేటియనియుఁ దోచుచున్నది. అందుకు సందియము లేదు భళా! ఏమి! ఆరాజకుమారి సౌందర్యము!

సావి—(నర్మదను జూచి) చెలీ! ఇంక మనమేగుదమా? రెండడుగులు ముందుకు వేయుము.)

సత్య—ఆహా!

తే॥ గీ॥ విలసితాననంబు శశితో • జెలిమి సేయఁ
దియ్య పలుకులు తేనెలు • వియ్యమంద
నడక లంచల గొంచద • నంబుసేయఁ
గమలగంధి మనోహరా • కార మొప్పు॥

ఇట్టి సౌందర్యరాశి యేమహానుభావునకుఁ జనించి, యేభాగ్యశాలిగృహంబు పావనము సేయుచున్నదో! (ఆలోచించి) కాదు కాదు. ఈమె యవివాహిత. కాకున్నచో నాదృష్టి యీామెపైఁ బాఱనేరాఁడు. ఈమెనుజూచినంతనే నాచిత్తమది యొకతీరునఁ జనించినది. మాననమా! నీ కీవెఱ్ఱి యేమి?

మ॥ సకలశ్రీయుతమైన రాజ్యము రిపు • క్ష్మానాథుచేఁ బెట్టి, యు
ద్యుక్తలంకాత్ముని శ్రీశుఁగొల్చుచు నర • ణ్యంబందునున్నట్టి మా

మకమా౦తన్ బితఁగొల్పు నేనిపుడు భా • మారత్నమున్ జూడ్కనిం
చుక ధైర్యంబు వహింప లేమి యకటా • చోద్యంబు గాఁజిత్తమా!
సపుణ్యమూర్తి యీకాంతాశిరోవతంసమును నుద్వాహంబాడి సౌఖ్యములఁ బొందనున్నాఁడో వానిదే జన్మ!

ఉ॥ ధాత యనేక సుందరుల • ధాత్రిని సృష్టి యొనర్చు చుండఁ, యా
ధాతకు గర్వభంగమును • దప్పక చేయఁగ నౌనటంచు ల
క్ష్మ్మతరుణీమణీసుతుఁడు • జిత్తమునం దలపోసి పోసి, య
జ్ఞాతముఖిన్ సృజించెనని • యాత్మఁ దలంతును నేఁడు నేటికిన్॥

ఏమో కాని నా మనస్సాగక యున్నది. నమిాపించి పలుకరింతునా? (ఆలోచించి) అట్లు చేసినచో దోషముకదా! అట్లు చేయకయుంటినేని యీరి యుదంతము నాకెట్లు తెలియును? అయ్యో! నాకీవెఱ్ఱియేమి? యీరి వృత్తాంతము నాకుఁ దెలసిన నెంతలాభమో, తెలియకపోయిన నంతియేలాభము. కాకున్నచో రాజ్యభ్రష్టుఁడనైన నాకీ చింతయేటికి?

[తెరలోఁబెద్దధ్వని]

సావి—(నర్మదను జూచి) పదియో భయంకరమైన వ్యాఘ్రరవము వినవచ్చు చున్నది. నాకు మిక్కిలి భీతి గలుగు చున్నది.

నర్మ—అదుగో! వ్యాఘ్రము మనదెసకే వచ్చుచున్నది.

సావి—అయ్యో! మనకింక నేమి

(ఇద్దఱును చెఱియొక దెసకు బరుగెత్తుదురు)

సత్య—(ఎదుటఁజూచి) అదిగో! నా వింటిదెబ్బను తప్పించుకొని పోయిన యీవ్యాఘ్రము మిగులఁ కోపావేశమున నాతలిరుఁబోండ్లపై లఘించుటకుఁ గాబోలు నట్లు పరుగెత్తుచున్నది. ఇప్పట్లు దానిం దునిమి వారి ప్రాణముల రక్షించెదఁగాక!

(తెరలో)

హా! పులివాతఁబడనున్న నన్ను రక్షించు వారెవ్వరు లేరా?

సత్య—స్వప్రాణ సంరక్షణార్థమై యెవరిమార్గము వారు చూచుకొందురుగదా! ఆమెచెలికత్తె యేదారినో చని యెక్కడనో డాగియున్నది. ఈమె భయముచే నట్లు కేకవేసినది (బిగ్గరగా)

తే॥ గీ॥ వలను వల దిట్లు భయమందఁ • గలికిమిన్న
యార్త రక్షణశాలినై • యలరు నేను
సత్వరమ్ముగ నేతెంచి • శౌర్యమునను
వ్యాఘ్రమును దున్మి నిన్నుఁ గా • పాడువాఁడ!

(నిష్క్రమించును)

సావి—(ప్రవేశించిన తరువాత తనలో) ఆహా! పులివాతఁ బడనున్న సమయమున కరుదెంచి నన్ను రక్షించినది. భాగ్యశాలి యెవతకదా! అతఁడా సమయమునకు రాకయున్నచో నేనీపాటికి కాలయమునకరిగియేయుందును. ఈపురుషునిఁ జూడగా కంనా స్వప్నమందు సాక్షాత్కరించిన వానివలెఁ జూపట్టుచున్నాఁడు. అందుల కావంతయు సందియము లేదు. ఈమహారణ్యభూమికతఁ డేలవచ్చెనో! అతఁ డీరీతి దాపసవేషమున నుండుటకే కారణమో? వృత్తాంత మరయుటకైన వ్యవధిలేక పోయెనే! వ్యాఘ్రమును దునిమినంతనే యాతఁ డరగినాఁడు. ఇంకనాతని ముఖసందర్శన మబ్బదు గాబోలు. కలలోఁ గన్నపురుషుఁడు నేఁడు ప్రత్యక్షముగ సందర్శనం బొసంగెను గదా యని యెంతయు సంతసించితిని. నాహృదయ మాతని యందు సంపూర్తిఁగ జిక్కినది. అక్కటా! ఇప్పుడు నేనేమి సేయుదును? ఆతనిని మరలఁ జూచుట యెట్లు సంభవించును?

(సత్యవంతుఁడు—ప్రవేశించును)

సత్య—(తనలో) నేనరుగుటయం దొకక్షణ మాలస్యమై యుండెనేని యాపూర్ణేందువదన యీపాటికి ప్రపంచమును విడిచియే యుండును. కాని భగవంతుఁడు నాయందుంచుటచే నట్టి యపాయ మామెకు సంభవింపకుండనే వ్యాఘ్రము నాచేఁ గూలినది.

ప్రాణరక్షణమంది యాతరుణీమణి యెక్కడ కరిగెనో! (అటు నిటు చూచి) అదుగో! ఆసీమంతిని యావృక్షముక్రిందఁ దన చెలిరాకకు గాఁబోలు వేచి యున్నది. సమీపించి యామె యుదంతంబు నడిగెదనుగాక! (సమీపించుచున్నాడు)

సావి—(సిగ్గునటించి కొంచె మవలకుఁ బోవును.)

సత్య—(తనలో) ఈలజ్జాభినయ మీమె మోమున కొక యపూర్వమైన సౌందర్యమును దెచ్చినది, ఈమెను పలుకరించెదనుగాక. (ప్రకాశముగా)

తే॥ గీ॥ ఇంత సిగ్గేల పొందెదవో • యింతి మిన్న
వ్యాఘ్రమును దున్మి నిన్నుఁగా • పాడినట్టి
వాఁడఁ గానొకో నక్కా జెర • వాని సగిది
గాంచ ధర్మమె నీకు నో • చంచలాక్షి

నీ క్రీగంటి చూపు లొక్కసారి నాపైఁ బ్రసరింపఁ జేయుము.

సావి—(తనలో) ఆహా! ఏమి! ఈతని వాక్కులనుండి యమృత రసం బొలుకుచున్నది. ఇప్పుడు నేనీతనితోడ నేమని భాషింతును? అయిన నిట్లు బలికెదఁగాక! (ప్రకాశముగా) పుణ్యపురుషా! నీవెవ్వరవో నాకుఁ దెలియదు గాని, నాప్రాణసంరక్షణమాచరించిన నీనిర్హేతుకజాయమాన కరుణకు నే ననేక వందనంబు లర్పించుచున్నాను. (ఇంచుక యూరకుండి) ఆర్తరక్షణుండవగు నీ కులగోత్రంబు లెఱుంగఁదలంచిన నన్ను మన్నింతురుగాక!

సత్య—ఇందుముఖీ! నాకులగోత్రనామముల కేమి? విని వచ్చును? కాని ముందుగా నీయుదంతంబు నెఱుంగ నాచిత్తము దత్తర మందుచున్నది.

సావి—తే॥ గీ॥ మద్రదేశంబు బాలించు • మనుజనాథుఁ
డశ్వపతి యాత్మజాతగా • నవని యందు
భవ్య సావిత్రివరమునఁ • బడసె నన్న
వినుమ! సావిత్రి యను పేరఁ • దనరు దాస॥

మాతఁడిప్పుడమ్మాందలను వెంటబెట్టుకొని యీవింధ్యారణ్యప్రదేశమునకు విహారార్థమై యరుదెంచి యిచ్చటి కనతిదూరంబునం దు విడిసియున్నాఁడు. నేనును జెలికత్తెయు నిట్లీవనంబున కరుదెంచితిమి. నేను పులినోటఁబడకుండ నీచేఁ గాపాడఁబడితిని.

సత్య—(తనలో) ఏమి! ఈవినయము! ఈ గంభీరవాక్యములు! ఈమెను వీక్షింపుచున్న కొలఁదిని నాచిత్తమంత కంతకు మారవికారము నందుచున్నది. ఈమె యవివాహితక దా! నాకోరికయేల వెలిబుచ్చరాదు? వెలిఁబుచ్చినచో నేమనునో? ఈకన్యయెవ్వరికైన నిర్దేశింపఁబడియుండెనేమో! అట్లయినచో నాకోరిక యుత్తదే యగును. కావున నెమ్మదిగా నిట్లడిగిచూతుఁ గాక! (ప్రకాశముగా) తరుణీమణీ! నిన్నుఁ జెట్టబట్టు ధన్యుండైన పురుషుఁ డెవ్వరో నే నెఱుంగఁదగునా?

సావి—పురుషవరేణ్య! నే నవివాహితను.

సత్య—అట్లయిన నీ వెవ్వరికైన నిర్దేశింపఁబడియుంటివేమో యెఱుంగవచ్చునా?

సావి—(తనలో) ఈతని ప్రశ్నయందు గూఢార్థము కలదు. ఈతని సుందరముఖారవిందసందర్శనము జేసినప్పుడే నాడెందమీతని వశమైనది. ఇప్పుడు నేనీతని కేమని ప్రత్యుత్తరమియ్యగలను? (ప్రకాశముగా) నే నెవ్వరికొఱకును నిర్దేశింపబడి యుండలేదు. (క్రిందుఁ జూచును.)

సత్య—(స్వగతము) ఈమె నాయభీష్టమిూడేరుటకుఁ గొంత యవకాశ మిచ్చినది. కాని నాకోరిక బయలుపెట్టుటకు మాత్రము నా చిత్తము సమ్మతింపకయున్నది.

సావి—(తనలో) ఈతఁడేదియో యాలోచింపుచున్నాఁడు. (ప్రకాశముగా) పురుషవరేణ్యా! నన్నుఁగూర్చి తెలియఁదగిన విషయములఁ దెలిసికొంటిరి. మీవృత్తాంతము నేను వినఁదగుదునేని యెఱిఁగింపఁగోరెద.

సత్య—అయ్యో! ఈసిర్భాగ్యుని వృత్తాంతము నీ వెఱుంగఁ దలంపు చుంటివా?

తే॥ గీ॥ వినుము! నేను ద్యుమత్సేన • విభుని సుతుఁడ
సత్యవంతుడఁ బేరున • జలరుహాక్షి

సావి— మనుజవిభుని సుతుఁడవయ్యు • ముని విధమున
బరగుచుంటి విదేల యో • భాసురాంగ॥

సత్య—(తనలో) ఈమెను చక్కఁగ నడిగితిని. కాని దీనికి బ్రత్యుత్తర మెట్లీయవలయునో నాకు దెలియకున్నది (ప్రకాశముగా)

తే॥ గీ॥ బంధు లోడలా నోడలు • బంధులగును
ననెడు సామెత వినలేదె • యతివమిన్న!
కాలపురుషుని చిత్రంబు • గ్రన్ననంగ
శక్తుఁ డెవ్వఁడు ధాత్రిపై • జలజనయన!

సావి—(తనలో) ఈతని వాక్యముల వలన యర్థము నాకు గో చరమగుటలేదు. ఏమైన నేమి! నా కితఁడే మనోవల్లభుడు గావలయును.

[ తెరలో ]
చెలీ! సావిత్రీ! సావిత్రీ!

సత్య—(స్వగతము)ఈమె నన్వేషింపుచు చెలికత్తె వచ్చుచున్నది. ఇప్పు డామె రాక మా సంభాషణ కంతరాయము గలిగించునుగదా!

సావి—(ఎదుటజూచి) అదుగో! నర్మద యిట్లు వచ్చుచున్నది.

నర్మ—(ప్రవేశించి సావిత్రిని జూచి) ప్రాణసంరక్షణ మాచరించుకొని బ్రతికియుంటివా? అమ్మయ్యా! ఇంక బోవుదము రమ్ము.

[ తెరలో ]
సత్యవంతా! సత్యవంతా!

సత్య—(తనలో)ప్రియుహి తుండగు గాలవుడు నాకొఱకు వచ్చుచున్నాడు.

గాలవుడు—[ప్రవేశించి సత్యవంతునిఁ జూచి] స్నేహితుఁడ వనగా నీవే స్నేహితుఁడవు. ఈరోజున నాతోఁ జెప్పకుండగ నొంటరిగా వచ్చితి వేమి? (ఎదుటజూచి) వీరెవ్వరు? ఈ సుదతీమణు లిచ్చటి కేట్లువచ్చిరి? స్త్రీలు పురుషులచూపులకు వ్యాఘ్రిస్వరూపములవలె గన్పట్టుదురు సుమా! (సమీపించి) ఏగ్రామ మమ్మా మనది?

సావి—భూసురోత్తమా! నేను మద్రరాజదుహితను. వనమునకుఁ జెలితో నరుదెంచి, పులివాతఁ బడనుండఁగా ఈ రాజపుత్రునిచేత రక్షింపబడితిని.

గాల—(తనలో) ఏదో కాస్త జరిగినది. (ప్రకాశముగా) (సత్యవంతుని జూచి) పాపము! నీవీమెకుఁ బ్రాణదాన మిచ్చితివా? సరే యిఁక పోదము. రమ్ము. ఆలస్యమైనచో వ్యాపారము ముదురును. (చేయిపట్టుకొని లాగుచున్నాఁడు.)

సత్య—మిత్రమా! తొందరపడవలదు. ఇదిగో! వచ్చుచున్నాను.

నర్మ—(తనలో) ఈసావిత్రి మొగముఁజూడఁగా నీతనితో సంభాషించినట్లు దోచుచున్నది. ఈమెచూపులన్నియు నాతనిపైననే ప్రసరింపజేయుచున్నది. (ప్రకాశముగా) సావిత్రీ! ఆలస్యమేల చేసెదవు? ఇంతకుమున్నె నన్ను రమ్మని తొందరపెట్టితివే! ఇప్పు డింటికిఁబోవుట కిష్టము వచ్చుటలేదాయేమి?

సావి—ఏమే! నీపరిహాసవాక్యములు! (స్వగతము) నన్ను రమ్మని యీచెలి తొందరపెట్టుచున్నది. అక్కటా! ఈతని విడిచి వెళ్ళవలసివచ్చినదే! కానిమ్ము. ఈతఁడు ద్యుమత్సేనుని సుతుఁడనియు, సత్యవంతుఁడనియుఁ దెలిసెనుగదా!

సత్య—(స్వగతము) ఈతని విడిచిపోవుటకు గాళ్ళాడకున్నవి. అయినను దప్పదు. ఇదిగో! వచ్చుచుంటి.

తే॥ గీ॥ ప్రాణముల గాచినట్టి నీ • పరమకరుణ
మరునజాలను, బోయెద • మానవేంద్ర!
దైవ మనుకూలుఁ డగునేని • దప్పకేను
నిన్నుఁగూడి సుఖంబుల • నొగడగలను॥
(సత్యవంతునిఁజూచుచు జెలితో నిష్క్రమించును.)
సత్య—సావిత్రిం జూచుచు దనలో అదిగో! ఆకన్యామణి యేగు
చున్నది.
తే॥ గీ॥ తనదుచిత్తము నామీదఁ • దగిలెననుచు
దెలుపఁ గాబోలు వెనుకకుఁ • దిరిగి తిరిగి
చూచుచును బోవుచుండెను • సుదతి, యామె
మోవు లిప్పు డనంగుని • తూపులయ్యె॥
అక్కటా! ఆ విరిబోడి యరిగినది. ఆ సంపూర్ణపూర్ణిమా చంద్రమం
డలమును ధిక్కరించు మొగంబును నేనన్నఁడైన మరల గందునా?
అట్టిభాగ్యము నా కున్నదో లేదో! ఇంకను నా సుందరీమణి నాతో
నేమి సంభాషించియుండునోగదా! ఆమె చెలికత్తెయు, నాహితుడగు
గాలవుఁడును మాయెడ బాటునకుఁ గారణులైరి. (సావిత్రినుద్దేశించి)హా
సుదతీమణీ! నీపైఁ జిక్కిన నాచిత్తము నెట్లు మరల్చుకొందును?
గాల—సమయ్యా! మిత్రమా! నీకేమో తాపము గలుగుచున్నట్లు
న్నదే. ఇప్పుడరిగిన యాస్త్రీపిశాచ మేమైన సోఁకెనదా యే
మి? చూఁడగా నట్లే యున్నది. రమ్ము రమ్ము. అరణ్యమునఁ
దపోవృత్తినున్న నీకీ స్త్రీప్రపంచగోష్ఠి యెందుకు?
సత్య—హా! సావిత్రీ! సావిత్రీ!
తే. గీ. ఇట్టె మరుదెంచి మరులు నా • కట్టెగొలిపి
యరిగితివి నీవుదారిని • సంబుజాక్షి
దారి కానింప నేదారి • దరలువాడ
మరల ననుఁజూచు భాగ్య మే • మాడ్కిగలుగు!
(సావిత్రి యరిగినదెసకై చూచుచు మిత్రునితో నిష్క్రమించును.)
ఇది ప్రథమాంకము.



# సావిత్రీ నాటకము.

## ద్వితీయాంకము.

రంగము:—[సావిత్రి సుందరవనమున నొంటిగఁ బ్రవేశించును.]

సావిత్రి—(తనలో సత్యవంతు నుద్దేశించి) హా! సత్యవంతా! నాడరణ్యంబున నీ సందర్శన మాచరించినంతనే నాహృదయము నీవశమై యిట్లు పరితపించుచుంటిని. నా హృదయము నీకెఱింగింప దలంచితిని గాని చెలికత్తె యరుదెంచి నన్నుఁ దొందర పెట్టుటచే నూరకుండవలసినదాననై వచ్చితిని. నీయుదంతంబైన నేను సంపూర్తిగఁ గనుంగొనలేకపోయితిని.

మ. తరుణీరత్నము నీకునై యిటులు సం • తాపించుచున్ మదిన్
గరుణంబూనుచు వచ్చి నిన్నుఁ గని వ • ర్ణించువారేరి? యే
దెర గూహింతును, వేఁడు దెవ్వరి నిటన్ • దిక్కేమి యిప్పట్ల, సుం
దరమూర్తిన్ నినుఁగాంతునో కననో మ • ద్భాగ్యంబికెట్లున్నదో.

అక్కటా! నిన్ను వివాహమాడకున్న నా శరీరమునఁ బ్రాణములు నిలుచునా? అనేక రాజకుమారుల చిత్రపటముల నీక్షించియుఁ, జలింపని చిత్తము భవదీయ దివ్యమంగళ విగ్రహ సందర్శన మాచరించినంతనే చలించి నీవశమైనది. అప్పుడు నాకోరిక నీకుఁ దెలిపియున్నచో నా మనోరథ మీడేరియుండునుగదా! నే నరుగునప్పుడు నా పైఁ బఱపిన నీచూపులు మఱపురాకున్నవి.

మ. ప్రమదంబొప్పఁగ నీదునామమును వ్యా • త్పద్మస్ఫురద్రత్నసీ
రములం దెప్పుడు నుంచి సంతత మభీ • ష్టావాప్తి నాసించి వా

కుసుమశరాళంబులఁ గొల్చుచుంటి నిద్రగ • కోపేక్షయా సాంద్రయా
విమలాంగీ నినుఁ జేరనెంచు తరుణీ • పృథ్వీపతీనందనా.

మ॥ పులివాతీ బడనున్న సన్నల కృపాం • భోరాశివై బ్రోచి తీ
యులనీ వచ్చెను, మన్మథాగ్నిఁ బడినే • నీభంగి నిప్పుడు, నీ
విలసద్దివ్యకృపాంబువుల్ జల్లి నే • వేగన్ దగన్ బ్రోవరా
వలదే యీ త్రిజగ త్పవిత్రవరదే యో • భవ్యాత్మ సాళ్వాత్మజా॥

అయ్యో! యేమిది! నీ నామము స్మరించినంతనే యీ మన్మథుండు నాపై బాణవర్షము గురిపించుచున్నాడు. (మన్మథుని నుద్దేశించి) మన్మథా!

తే॥ గీ॥ దంపతులపైకి నీవును • దాడివెడలి
వాడిశరములఁ జిమ్మంగ • వచ్చెగాని
యలమ్మ్రుమ త్తైనజాఁ బలిగ • సంపఁగోరి
వేచియున్నట్టి సన్నల • నేఁచెదీవు॥

కొన్ని దినములవఱకును నీశరవర్షమాపుము. (ఇంచుక యూరకుండి) నేనిట్లు చింతింపుచున్నందువలనఁ బ్రయోజనమేమియున్నది? నాహృదయము గట్టిగా సత్యవంతునియందు జిక్కియున్నదని నాతల్లిదండ్రుల కెఱింగించితినేని వారే నన్నాతనికిచ్చి వివాహము సేయుదురు. ఇందు కన్యథా జరుగునేని మరణమే శరణము గాఁగాక! (నిష్క్రమించును.)

---

రంగము:— (మందిరములో అశ్వపతియు, భార్యయగు
మాళవియు ప్రవేశము.)

అశ్వ—తరుణీ! ఆడుపిల్లలఁ గాంచిన వారి జన్మ బహు కష్టమైనది కదా! వారి వివాహ విషయమై యెంత కష్టమైనను బడవలసి వచ్చును. మనము తెచ్చిన వరుఁడు కన్యకకు బనికిరాడు. ఆమె వరించిన వరుఁడు మనకుఁ బనికిరాడు. ధనముగల్గిన వానికి విద్యయుండదు. ధనమును విద్యయు నున్నవాడు వరా

క్రిమహీనుఁడై యుండును. ఈమూహము గల్గియున్నవానికి సౌందర్యము గొఱఁతయై యుండును. అబ్బా! ఇవి యన్నియు నుఁ గలిగిన వరునిఁదెప్పుట మిక్కిలి కష్టతరముగదా!

తే॥ గీ॥ పరిణయంబుసేయఁ బ్రాయంబు • వచ్చెఁగాదె
విమలగుణశీల మనదు సా • విత్రికిపుడు
యింక జేయకయున్న న • రేంద్రులెల్ల
బరిహాసింపరె మనల భా • వంబులందు.

ఆ సత్యవంతునిఁ దప్ప నితరుని వరింపనని పట్టుబట్టినది. ఇందులకు నే నేమి సేయుదును? అద్యుమత్సేనుఁడు రాజ్యభ్రష్టుఁడై యంధుఁడై సతీసుతులతో నరణ్యవాసియై యున్నవాఁడు. కన్నులార నిట్టిది చూచుచు నాతని పుత్రునకు నెట్లు సావిత్రినిచ్చి వివాహము సేయఁగలము!

మాళవి—నాథా! చిన్నదగుటచే నట్లు చెప్పియుండును. మనము బుజ్జగించి నెమ్మదిగాఁ జెప్పినచో నదియేల వినకయుండును?

అశ్వ—అమ్మాయిని పిలిపించి నీయెదుట జెప్పెదను. నీవుగూడ జెప్పుము. నాకు మాత్రి మిట్టిసంబంధ మీయవలయునని యిష్టమున్నదా యేమి? (ప్రక్కంజూచి) ఎవరక్కడ?

(తెరలో—మహారాజా! ఏమి సెలవు?)

అశ్వ—సావిత్రి నిటకుఁ దోడ్కొనిరమ్ము.

(సావిత్రి ప్రవేశించును)

సావి—(తండ్రింజూచి) తండ్రీ! నమస్కారములు.

అశ్వ—అమ్మాయీ! ఇటువచ్చి కూర్చుండుము.

సావి—(తండ్రిప్రక్క నాసీనయగును.)

అశ్వ—కుమారీ! సావిత్రి సంతానము లేక లేక తపంబొనర్చి సావిత్రీ ప్రసాదమున నిన్ను మేము గంటిమి. మాకు బుత్రుఁడవ

యుఁగను బుత్రికవయినను నీకే. నీకతంబున మేము కృతార్థులము గావలయును. మా యాసలన్నియు నీపై నిలిపియుంటిమి. నీకును వివాహమునకు దగిన వయస్సువచ్చినది. ఇంక నేను నీ వివాహవిషయమున నాలసించితినేని రాజలోకమునఁ బరిహాసపాత్రుఁడనగుట నిశ్చయము. కావున నీ కనురూపుఁడగువరుని గోరుకొనుము. ఏకార్యమునైనఁ జేయుపట్ల నొకరిచే వ్రేలుమడిపించుకొనునట్లుండఁగూడదుగదా. సత్యవంతునిఁ దప్ప నన్యులను వరింపనను నీపట్టుదల మానుము. తల్లీ! ఏవిశేషమును జూచి యా సత్యవంతుని వరించితివో దెలియకున్నది.

తే॥ గీ॥ అతనిరాష్ట్రంబులెల్ల దా • యాదులకు నిచ్చి
తల్లిదండ్రులతోడను • దపసివోలె
గాననంబులలో నడఁ • గష్టపడెడి
సత్యవంతునిఁ గోరుదే • చాలుఁజాలు॥

నీవు సత్యవంతునిఁ గోరితివని యెవ్వరైన విన్నచో నవ్వుదురు. అదియుంగాక, సకలంబు నెఱింగియుండియుఁ జక్కనిచుక్కయగు కూఁతురను రాజ్యచ్యుతుఁడై, నిరుపేదయై, యరణ్యవాసియైయున్న సత్యవంతునకొసంగి గొంతుకకోసెననునింద నాపైబడును. నీవజ్ఞానురాలవుగావు. చదువుకొన్నదానవు. సమస్తమును దెలియును.

మ॥ కలరెందెందరొ భూపతుల్ భువిని లో • కఖ్యాతిమైమించువా
రలు, సౌందర్యమునందు మన్మథునిఁ దా • రాధీశునిన్ మించువా
రలు, తేజంబున భానుమించదగువా • రల్ గాన నీ వట్టివా
రిలో వేడ్కన్ దగువాని గోరుకొను మ • ర్థిన్ జంద్రబింబాననా!

మాళ—పుత్రీ! తల్లిదండ్రులమగు మామాట నాలింపుము. మేమెప్పుడును నీశ్రేయమునుగోరువారముగాని యన్యథా తలంచువారముగాము. నీవు తగిన వరునిఁ జేపట్టి సౌఖ్యమందుచుండఁగా జూచి యానందించువారముగదా!

సావి—తల్లిదండ్రులారా! ఇంతవరకును నన్నుఁ బెంచి పెద్దదానిఁగ జేసిన మీరు నా శ్రేయముఁ గోరుదురని నాకు దెలియును. మాతృపితృఋణము నే నెప్పటికిని దీర్పజాలను. కాని మీరు నా యుద్దేశ్యము సంపూర్తిగ గ్రహింపక యుంటిరిగదా యని నేను విచారింపుచున్నాను. అనేక రాజకుమారుల చిత్రపటంబుల జూచినను నించుకేనియుఁ జలింపని నాహృదయ మా సత్యవంతునిపైఁ జిక్కినది. ఆతఁడే నా వరుడని నిశ్చయించుకొని యుంటిని. నేను మనసా వరించిన యాతనిని విడిచి వేరొకని గోరుట ధర్మముగాదు. అట్టిది సాధ్వికి లక్షణముగాదు. ఇట్లు నేయుమని చెప్పుటగూడ గురుల దోషమని నొక్కి వక్కాణింపుచున్నాను.

అశ్వ—పుత్రీ!

తే. గీ. సంపదలయందు మఱియు రా • జ్యంబునందు
నమిత ధనమందు ఘనపరా • క్రమమునందు
మిగుల దీపించు రాజులు • జగతియందు
లేరె? పరిణయంబాడఁగా • లేమ! వినుమా

సావి—తండ్రీ! రాజులులేకేమి! ధరాతలమంతయు ననేక రాజన్యమయమైయున్నది. సంపదలఁజూచిగాని, సౌందర్యాది గుణములఁజూచిగాని నేను సత్యవంతుని వరించలేదు. ఒకప్పుడు మహదైశ్వర్యవంతుడు గర్భనిర్భాగ్యుడగును. గర్భనిర్భాగ్యుడు మహదైశ్వర్యవంతుడగును. కాలచక్ర మెట్లు తిరిగిన మానవులట్లు తిరుగుచుందురు.

తే॥ గీ॥ అతఁడె నాపాలిదైవంబు • నతఁడె భర్త
యతడె నాయేలుగడయును • ననుచుఁదలచి
భావమునఁగోరితిని సత్య • వంతు నేను
సంశయించక చెప్పితి • క్ష్మాతలేంద్ర!

తమ పుత్రికచిత్త మెవ్వనిపైఁజిక్కునో యట్టివానికిచ్చి పెండ్లి

చేయుట తల్లిదండ్రులకు శ్రేయస్కరము. సత్యవంతుడు రాజ్యభ్రష్టుడనియు వనవాసియనియుఁ జెప్పితిరి. అశాశ్వతములగు రాజ్యలక్ష్మినిగాని చంచలమగు సౌఖ్యములగాని నేను వాంఛించియుండలేదు. నాకు గావలసినది ఒక్కగుణమే. అట్టిది సత్యవంతునియొద్ద నుండినట్లు నేను గ్రహించితిని నే నాతని వరించితిని. ఇంక మీరు నన్నాతని కొసంగి వివాహముగావించి కృతార్థులగుడు.

మాళ—అమ్మాయీ! నీవు పట్టినపట్టు విడువవా?

సావి—ఇందుపట్టుమి యనుటేమి మనసార గోరిన యాతనిని విడిచి యన్యులఁగోరుటకు నాచిత్తము సమ్మతింపదు. ఇక మీ రట్టి యాలోచన విడువుడు

మాళ—నీయుద్దేశమును విడువవా?

సావి—ఏల పదిసారు లడిగెదవు? నా నిశ్చయము నింతకుబూర్వమే మీకుఁ జెప్పియుంటినికదా.

మాళ—[అశ్వపతింజూచి] నాథా! ఇంక నావిషయమునుగూర్చి దీని నడిగి యందువలన బ్రయోజనము లేదు. మీ మదికిదోచిన యొక్కరాజకుమారునకు దీని నిచ్చిప్రయత్నము సేయుడు. ఇది చెప్పినట్లు మనము చేయుట పాడిగాదు. దీని సమ్మతితో మన కేమిపని యున్నది? ఇంతగారాబముగాఁ బెంచినకారణము చేతనే యిప్పుడిచ్చవచ్చినట్లు మనసెత్తికెక్కినది.

సావి—అమ్మా! నీమాటలు మిగుల వింతగొలుపుచున్నవి.

మ॥ వరభూషాదు లొసంగుటో ప్రియమొల ♦ ర్పగ జీరలన్ దెచ్చిభా
స్వరతన్ గట్టగఁబెట్టి ముచ్చటలు దీ ♦ ర్పంగాఁదలంపూనుటో
తరుణీరత్నము గోరుకొన్నవరు మో ♦ దంబారగాఁదెచ్చి సొం
పరయన్ బెండిలిసేయకుండుట ని భా ♦ వంబందు యోచింపుమా.

నేను వరించినవానిని విడిచి బలవంతముగ వేరొకనిం దెచ్చికట్టి పెట్టి నా గొంతుక గోయదలంచితివా యేమి?

మాళ—నీగొంతుక మేము గోయుదలంపలేము. ఎవ్వఁడోయొక నిరు
పేదను వరించి నీగొంతుక నీవే గోసికొనఁదలంచుచున్నావు.

సావి—తల్లీ! భాగ్యాభాగ్యములు భగవత్ప్రసాదితములు. ఒకవేళ
సత్యవంతుఁడు నిరుపేదగానుండినను వివాహమైన పిదపఁ బర
మేశ్వరుని కరుణవలన భాగ్యాన్వితుఁడై యొప్పఁగూడదా?

మాళ—ఇప్పటి కాతనిభాగ్య మింతచక్కగా నున్నదికదా! ఇంక
నిన్ను వివాహమాడినపిదప సంపదతో దులదూఁగును కాఁ
బోలు! ఎందుకీమాటలు? నీవు పట్టిన పట్టుమాత్రము విడువక
యున్నావు. ఒకవేళ సత్యవంతుఁడు నిన్ను వివాహమాడనని
చెప్పినచో నీ వేమి చేయుదువు? అప్పుడు వేఱొకనిని వరింతు
వా యేమి?

సావి—అట్లెన్నటికిని జరుగదు. ఒకవేళ నన్ను సత్యవంతుఁడు వివాహ
మాడుటకు సమ్మతింపనిచో నేమి సేయుదువని యడుగు
చుంటివా? నా మనోనిశ్చయమును వినుము.

చ. గరళము లేదొ గ్రోలఁగను • ఖడ్గము లేకడె గొంతకోతకై
వరనదులెల్ల యింకినవె • భవ్యతటాకము లెండిపోయెనే
యుఱికిని త్రాడుగల్గదొకొ • యుర్విని సాళ్వసుతుండు తాను నన్
బరిణయ మాడకుండినను • సంబున నిశ్చయముగ వచించితిన్.

మాళ—కానిమ్ము కష్టసుఖము లనుభవించు దానవు నీవు. నీవ్రాత
యెట్లున్న నట్లగును. దానినెవ్వరు దప్పింపగలరు.

అశ్వ—(భార్యంజూచి) సతీ! పిల్లతో వాగ్వాద మేటికి?

దాసి—(ప్రవేశించి) దేవా! నారదమునీంద్రులు వచ్చుచున్నారు.

[నారదుఁడు పాటఁబాడుచు ప్రవేశించును.]

అశ్వ—(భార్యతో నెదురేగి నమస్కరించి) మునీంద్రా! ఇటు దయ
చేసి యీభద్రపీఠ మలంకరింపుఁడు.

[ నారదుఁ డాసీనుఁ డగుచున్నాడు. ]

అశ్వ—(సావిత్రినిఁజూచి) అమ్మాయీ! ఈ నారదమునీంద్రునకు నమస్కరింపుము.

సావి—(అట్లుచేయుచున్నది.)

నార—(అశ్వపతింజూచి)

తే॥ గీ॥ మునిజనార్చనంబు మరియుఁ • బుడమిసురల
సేన సేయుచుంటివె నీవు • క్షితిత లేంద్ర!
యాలుబిడ్డలు కుశలులై • యలరుచుండ్రె
శత్రుబాధలేక పుడమి • శాంతిగనునె?

అశ్వ—తావకకృపచే మే మందరము సుఖులమైయుంటిమి. మహాత్మా! తావకాగమనము మాకు శుభప్రదమని తలంచుచున్నాము పుత్రికావివాహ విషయమున నాలోచించుచుండగా నీవరు దెంచితివి. తద్విషయమున దగుమార్గ మొకటి మాకుఁ జూపి రక్షించెదవుగాక!

నార—ఏమీ! నీ పుత్రికారత్నమగు సావిత్రికింకను వివాహ మొనర్చియుండలేదా!

అశ్వ—లేదు. ఆ విషయమున నే ప్రయత్నము సేయుచుంటిని!

నార—ఇంత యాలస్య మేలచేసితివి? తగినవరుఁడు లభింపకయుండుటచేతనా?

అశ్వ—దేవా! ఏమని చెప్పుదును. అనేక రాజన్యుల చిత్రపటములఁ దెప్పించి సావిత్రికి జూపితిని. అందెవ్వరిని నామె వరింపక సాళ్వరాజసుతుండగు సత్యవంతునే కోరియుండెను. మునీంద్రా! ఇందులకు నాకేమిదారి?

నార—(సావిత్రిఁజూచి) అమ్మా! సావిత్రీ! రాజ్యభ్రష్టుఁడై కాన

సంబుల వసింపుచున్న యాతని నేలసరించెదవు? మఱొక్కనిని గోరుకొనరాదా?

సావి—మునీంద్రా! సమస్తధర్మాధర్మములను దెలిసియుండిన నీవే యిట్లు వక్కాణించిన నే నేమనఁగలదానను? చిత్తమందు మొదట వరించినవానిని విడిచి వేరొక్కనిని మరలగోరుట ధర్మశాస్త్రవిరుద్ధముగాదా! అదియుంగాక యది యుత్తమస్త్రీలక్షణమగునా? తాపసోత్తమా! పక్షపాతరహితుండవై యీ విషయమున నీవు సత్యము జెప్పుము.

నార—(తనలో) ఆహా! ఏమి! ఈచానశీలము! మనోధైర్యము! (ప్రకాశముగా) నే నందుకు వచింపలేదు. అట్టివానిం గైకొని నీ వేమి సుఖించెదవు?

తే॥ గీ॥ కందమూలఫలముల నొ • క్కొంగవలయు
నారచీరలనే మొయిన్ • దాల్పవలయు
దర్భశయ్యలయందునే • దనరవలయుఁ
గామినీ! యేమిసౌఖ్యంబు • గందువీవు?

నీ వాగర్భశ్రీమంతురాలవు. మందిరారామసీమలందుండి మహాసౌఖ్యముల నందుచుండెడిదానవు. అట్టి నీవు సత్యవంతుని వివాహమాడుటేమి? వేరొకని వరింపుము.

సావి—తాపసోత్తమా! నీవుగూడ మాతల్లిదండ్రులమార్గముననే త్రొక్కుచున్నందుకు వింతయగుచున్నది. నాచిత్తమును నీవు పరీక్షింప నవసరములేదు. సత్యవంతునివప్ప వేరొకనిని వరింపను.

నార—(తనలో) ఇంక నీమె యన్యులవరింపుటకు సమ్మతింపదు. (ప్రకాశముగా) రాజేంద్రా! ఇంక నీకుమారి నీ మాటలు వినుసదికాదు. ఈమెచిత్తము తిరుగదు. కానిమ్ము. ఈమెపుణ్యవశమున సత్యవంతుఁడు మరల భాగ్యవంతుఁడగునేమో? కాని వివాహవిషయముగాన నొక్కసంగతి మాత్రము జెప్ప

వలసియున్నది. ఇట్టి విషయముసం జెఱిగియుండియుఁ జెప్పకుండుట భావ్యముగాదు. ఆ సత్యవంతునకు వివాహమైన యొకసంవత్సరముననే మరణము సంభవించును.

అశ్వ—
మాళ—} హా! హా!

అశ్వ—(సావిత్రినిఁ జూచి) అమ్మా! వింటివిగదా, ఇఁక నాకోరికను విడువుము.

మాళ—ఈమాట విన్నతరువాత విడువక యేమిచేయును? పరిణయమాడిన సంవత్సరముననే మృతిఁజెందునని తెలిసియుండఁగా నాతనినే వరించుట కీమెచిత్తము సమ్మతించునా యేమి?

సావి—అమ్మా! నీవు నామనోనిశ్చయము నింకను గనిపెట్టలేదుగదా. సత్యవంతున కారీతి మరణము సంభవించునని యూసంయమీంద్రుఁడు పలికినంతనే నాడెందం బందుకు భయంబందె, యధర్మ వర్తననగుదునా? మనసారఁ గోరినయాతనిని విడిచి వేరొకని వరింతునా? నారదుఁడు చెప్పినమాట నిజమేయై యుండుఁగాక! అయిననేమి? అంబికాకటాక్షమున నాతఁడు దీర్ఘాయుష్మంతుఁడై మనఁగూడదా? అట్లొకవేళ సంభవింపనిచో నేనుఁగూడ నాతనిమార్గమునే యనుసరించెదగాక! ముమ్మాటికిని సత్యవంతుఁడే నాప్రాణనాథుఁడు. అతనిందప్ప నే నన్యుల వరింపను.

మాళ—ఏమే నీగయ్యాళితనము! ఇంతకన్నను భయములేక తల్లి దండ్రులమాటల కెదురుబల్కుచుంటివి?

అశ్వ—తల్లీ! సావిత్రీ! సమస్తమును నెఱింగియుండియు నీవింతటి నెట్లు గోరుదువు! నీ కీకోరికను విడిచి మఱియొకని వరించి కులముద్ధరింపుము.

సావి—మిన్నువచ్చి తలపైఁ బడినను నే నధర్మకార్య మొనరింపను.

అశ్వ—(నారదునిఁజూచి) బ్రహ్మమానసపుత్రా! నారదా! వింటివి గదా. సావిత్రి మనోనిశ్చయము. మాకేమిదారిఁ జూపించెదవు? వివాహమైన సంవత్సరమునకే మృతిఁజెందు సత్యవంతున కీమె నీయవలసిన దేనా?

నార—(తనలో) ఆహా! ఈమె మనోనిశ్చయ మద్వితీయమై యున్నది. సుగుణములన్నియు సావిత్రియందు మూర్తీభవించి యుండినట్లు దోచుచున్నది. కాకున్నచో నింతధైర్యము, నిట్టిసాహసము, నిట్టిశీలము మఱి యేకాంతామణుల యందైనఁ జూచి యుంటినా? సుగుణవతియు, నుత్తమురాలు నగుటవలన నీమెకే తగియున్నవి. బాగుగా నాలోచించిచూడఁగా నీమెవలన నుభయకులములుగూడ బవిత్రములగునని తోచుచున్నది. ఈమెకుఁ బరిణయమైన వత్సరమునకు భర్తకు మృతిసంభవించినను, భగవత్కటాక్షమున దీర్ఘసుమంగలిగాఁ దనరగలదని నాచిత్తమునకుఁ బొడఁగట్టుచున్నది. పరమేశ్వరుఁడిట్టివారలనుగాక మఱియెట్టివారలనురక్షించును? (ప్రకాశముగా) భూపాలా! అశ్వపతీ! ఇంక నీసావిత్రి తనమనోనిశ్చయమును విడువదు. కాని పరమేశ్వరుని దయచేత నీమె దీర్ఘసుమంగలి గావచ్చును. ఇంకనీ వన్యథా యోచింపక యీమెకోరినట్లు సత్యవంతునికే యొసంగి వివాహము గావింపుము. బలపరాక్రమములందుగాని, సౌందర్యమునందుగాని, సత్యసంధత యందుగాని, వినయవివేకాది సద్గుణములయందుగాని యాద్యుమత్సేన పుత్రుండగు నాతనితోఁ దుల్యుఁడు ధరాతలమునందు లేడు. ఇంక నీవు సంశయింపకుము. నేను పోయివచ్చెదను.

సావి—మునీంద్రా! నేను ధన్యనైతిని. (నమస్కరించును.)

అశ్వ—(సావిత్రిఁజూచి) తల్లీ! విచారము మనుము. నీవుకోరినట్లు సత్యవంతునకే యొసంగెదను. (నారదునిఁజూచి) మహాత్మా! నమస్కరించుచున్నాము. కృపయుంచుఁడు.

(మాలవి, అశ్వ, నమస్కరింతురు.)

నార — సకల శుభావాప్తిరస్తు! (నిష్క్రమించును.)

అశ్వ — అమ్మా! సావిత్రీ! ఇంకరమ్ము. (మాళవినిఁజూచి) సతీమణీ! శుభదినము చూచుకొని, పిల్లను వెంటబెట్టుకొని వింధ్యారణ్యమున నున్న ద్యుమత్సేనవిభునికడ కరిగి యీసంగతిఁ దెలియఁ జేసి, యాత డెట్లు చెప్పునో యట్లు చేయుదము. రమ్ము. తత్ప్రయత్నమున నుండవలయును.

(అందఱును నిష్క్రమింతురు.)

---

రంగము — [వింధ్యారణ్యమున ద్యుమత్సేనాశ్రమ సమీపవనము —

[ప్రవేశము = సత్యవంతుఁడు.]

సత్య — (తనలో) అక్కటా! ఎన్నాళ్ళని యీమర్దశంబొంది, యీ ఘోరారణ్యమునవసించుట! రాజ్యభ్రష్టతకుఁ జింతింపనుగాని యంధులై యనేకకష్టముల నందుచున్న మాతలిదండ్రులఁ జూచిన నాకెంతయు దుఃఖమువచ్చుచున్నది. ప్రపంచమున నుంచిన దుర్దశలన్నిటియందును నంధతనుమించిన దేదియును లేదుగదా! ఒరులసహాయ మపేక్షింపకుండ నంధు లేకార్యమును జేయఁజాలరు. ఇంక నెంతకాలము మాకీవనవాసాయాసము ధాత వ్రాసినాఁడోకదా!

స॥ అడవులవాసమెప్పటికి • నైనను దీఱునె మాకు, శత్రుపృథ్వ
బుడమినిఁగూల్పఁగాఁగలనె • భూరితరంబగురాజ్యలక్ష్మిచే
పడునొకో తండ్రికిన్, మరల • బంధువులెల్లను హర్ష మంద నే
వడువునకష్టసంచయము • వాయును మమ్ముల, దోచదయ్యెడన్.

(పగనుద్దేశించి) ఓరీ! చిత్రకేతూ! ఎంత ఘోరకార్య మాచరించితివిరా!

తే॥ గీ॥ ధర్మసంధుండు సుగుణుండు • దానపరుడు
సత్యమే జయమనుమాట • జరుపువాఁడు

నైన నా తండ్రిని రణము • నందు గెలిచి
వెసల నడిపితె? రాజ్యంబు • విడిచి పోవ.

ఓరీ! పాపకర్తా! వృద్ధుడైన నరపాలునిమీదనా నీశౌర్యము జూపించుట! ఆసమయమున నేను బాలుడనైయుంటచే బ్రతికి పోయితివి, కానిమ్ము. ఎన్నటికైన నిన్ను రణమునగూల్చి మారాజ్యము స్వాధీనపఱచుకొనలేక పోవుదునా? నీవానర్చిన మహాదారుణకృత్యములు నాచిత్తంబున మెలంగుచునే యున్నవి. నీపైనెత్తివచ్చుట కింత వరకును మాతండ్రిగా రాజ్ఞ నియకపోవుటచే బ్రతికిపోయితివి. అరణ్యమున నంధులైయున్న తల్లిదండ్రుల సేవింపుచున్న యీసత్యవంతుడు క్షేమిసేయుడు గలుగునని గర్వించి యుంటివి గాబోలు. దురాత్మా! దైవబలమున్నవారికి సేనలు గాని మఱియేవిగాని యవసరములేదు. ఓరీ! చిత్రకేతూ!

సీ॥ భీమాహవంబున • వీరులెల్లరు మెచ్చ
ఘనరిపుశీర్షముల్ • దునుము వఱకు
దురుమాడి యందు నీ • దు శిరంబు గోటముం
దరఁగట్టి ముదమున • దనరు వఱకు
రాష్ట్రజనులనెల్ల • రావించి యాశిరం
బందరకును జూపి • యలరు వఱకు
ధర్మాత్ముఁడైన నా • తండ్రిని గ్రమ్మర
సింహాసనాసీనుఁ • జేయు వరకు

తే॥ గీ॥ నీదునామంబు మరువను • నిద్రబోను
సంతతము నట్టి యత్నంబు • సలుపు చుందు
సంచితంబైన ప్రతినఁ జె • ల్లించు కొందు
బ్రతికియుండిన నే నింకఁ • బాపచరిత!

కానిమ్ము, కొలది దినము లోపికవహింపుము. నీగర్వవృక్షము సమూలముగాఁ బెల్లగించెదఁ గాక. (ఇంచుక యూరకుండి) అయ్యో! నే నీ విషయమై యాలోచింపుచునే యుంటిని. నాదిత్తమా సావిత్రిపై కరు

గుచునేయున్నది. ఆమెసంగతి మఱచిపోవుదమని యెంత నిశ్చయించి
నను మఱపునకు రాకున్నది. రేయింబవళ్ళు సావిత్రి నాకన్నులయెదు
రుట నున్నటులే యున్నది. ఆహా! ఏమి! ఆ బాలామణి సౌందర్యము!

సీ॥ చైతన్యమందిన • చక్కని చిత్రంబు
చిఱునవ్వుఁగాంచిన • చిగురుబొమ్మ
నడుపాడఁగా నేర్చి • న లలిత తనువల్లి
ముఱిపెంబు దాల్చిన • విరులబంతి
వక్రతంబాసంగ • వచ్చిన క్రొన్నెల
పలుకాడఁ గరచిన • పసిడి ప్రతిమ
నిలుకడ గలిగిన • తొలుకారు మెఱుఁగు ధ
రకు డిగ్గినట్టిద • ర్పకుని యలుగు
తే॥ గీ॥ ననఁగ జెలువొందు నా యొల • నాగ మహిమ
మంజులాకార మెప్పుడు నా • మానసమున
బాయకున్నది మరల న • ప్పద్మగంధిఁ
జూచు టేమాడ్కిఁ గలుగునో • తోచదయ్యె॥

అబ్బా! ఆమెను దలఁచినంతనే మన్మథుండు పొంచి పొంచి
నాపై శరములఁ బరపుచున్నాఁడు. (మన్మథుని నుద్దేశించి)ఓయీ
కామదేవా! నీవు భగవంతుండగు శ్రీమన్నారాయణుని గర్భ
మునజనించితివి. సమస్తసౌఖ్యములకును దూరమై యంధులైన
తల్లిదండ్రుల సేవింపుచు నరణ్యమునఁ బరమ విరాగినై యున్న
నాపై నేల శరప్రయోగము గావింతువు? నీ విట్టి దుష్కార్య
ములు సేయుచుండుట చేతనే నిన్ను మున్నొకసారి శంకరుఁడు
దన కోపాగ్నిజ్వాలల భస్మము గావించినాఁడు. కాని నీ భార్య
యగు రతీదేవి మంగళసూత్ర మహిమచే బ్రతికి పోయితివి.
అట్లైనను నీకు శౌర్యము చావలేద. చింతచచ్చినను బులుసు
చావలేదను మాట యిట్టిదే.

( గాలవుఁడు-ప్రవేశించును. )

గాల—(ప్రవేశించి తనలో) ఈతఁడు వ్యాఘ్రము బారినుండి తప్పించిన కన్యామణినిఁ జూచిన నాటనుండియు నెవ్వని చూచినను నేదియో దీర్ఘాలోచన సేయుచునే యుండును. ఇప్పుడీతని వైఖరి చూడఁగా మన్మథావస్థను మునింగినట్లు దోఁచుచున్నది. (సమీపించి) మిత్రమా! సత్యవంతా! ఆస్త్రీ పిశాచము నిన్నుఁ బట్టిపీడింపుచున్నదే. ఆమెపై మోహము నీకొడలు దెలియ నీయకున్నది. అరణ్యమునఁ దాపసివలె నున్న నీకీస్త్రీవ్యసన మేల! నీకుగల్గిన యీస్త్రీచింత దల్లిదండ్రుల సేవలనుగూడ మఱపించు చున్నది.

సత్య—మిత్రమా! గాలవా! వచ్చితివా! అయ్యో! నాయవస్థ నేమని చెప్పుదును!

తే॥ గీ॥ భయద సంగ్రామభూమిని • వైరివిడుచు
శస్త్రచయమున కింతయు • జంకఁగాని
కామదేవుఁడు నాపైనఁ • గరుణలేక
శస్త్రములు బరపుటఁ జూచి • జంకుచుంటి॥

గాల—ఇదియేనా నీమనోధైర్యము! గురులను భజించి సకల శాస్త్రార్థములగ్రహించి నందువలనఁ బ్రయోజన మేమి యున్నది? ముక్కు మూసికొని యరణ్యమునందు దపము జేసినందువలనఁ బ్రయోజన మేమి యున్నది? సర్వతీర్థ సంచరణము వలనఁ బ్రయోజన మేమియున్నది? ఆమన్మథుని జయించినప్పుడే మానవుఁడు ధన్యుఁడగును! ఏదో మార్గవశమునఁ దటస్థించిన యొక కన్యకం జూచి యిట్లు పరితపించుట నీబోటిధీరులకు లక్షణము కాదు.

సత్య—సఖుఁడా! ఆమె సామాన్యకాంత కాదు.

తే॥ గీ॥ ఆమె చక్కఁదనంబును • నామె రూపు
నామె గుణములు వినయంబు • నామె మృదుల

భాషణంబులు నాదు భా • వంబు నందు
నాటి యున్నవి నిజముగా • నమ్మమయ్య॥

గాల—కాముకులకటులే యుండును.

[ తెరలో ధ్వని ]

సత్య—సఖుఁడా! ఏదియో కలకలము వినవచ్చుచున్నదే.

గాల—(చూచి) కలకలమే కాదు. హయములు నేనుగులు రథములు గూడఁ గాన్పించుచునే యున్నవి. ఇదియేదో వింతగాఁ దోచుచున్నది. అటుఁ జూడుము. ఎవ్వఁడో యొకఁ డీమార్గముననే పాదచారియై వచ్చుచున్నాఁడు. ఆతఁ డొకనరేంద్రునివలె గన్పట్టుచున్నాఁడు.

సత్య—మిత్రమా! ఈతఁడెవ్వఁడో మనకు వైరియై యుండును. మనలను రాజ్యంబునుండి వెడలనడిపిన చిత్రకేతుఁడే యై యుండును. అరణ్యములందుఁగూడ మనల నుండనీయక ప్రాణములఁ దీయ వచ్చుచున్నాఁడు.

[ తెరలో ]

అయ్యా! ద్యుమత్సేనాశ్రమమునకు మార్గమిదియేనా?

సత్య—(గాలవుని చూచి) ఇంక [illegible]దు. (ప్రకాశముగా) ఓరీ దురాత్మా! చిత్రకేతూ! నీకు ద్యుమత్సేనాశ్రమమునకు మార్గముగావలయునా? రమ్ము నేను బాలుండనై యుండగా మాతండ్రిని రణంబునం గెలిచి రాజ్యంబునుండి వెడలనడపి, యడివాలక వనంబులనుండు మా ప్రాణములఁ గైకొనఁదలంచి వచ్చితివా? ని రమ్ము. మా కష్టములదీర నిన్నిప్పుడే కాలుని ప్రోలికంపుదును.

(శరమును నెక్కువెట్టి)

మ॥ సమదాటోపభుజప్రతాపమహిమన్ • శౌర్యంబు దీపింప వ
త్సమునన్ బాణపరంపరాహతిని నీ • కన్ గూర్చి యస్మత్స్వధ

ర్మము నిర్మించెద నెల్లలోకములు న • న్మానంబుగావింపఁ గ
ష్టములెల్లఁ దమువీడిపోవఁగను నీ • చా! రాజవంశాధమా!

అశ్వ—(ప్రవేశించి) ఈతని వాక్యముల సరణిఁ జూడగా నీతఁడే సత్య వంతుఁడని తోచుచున్నది. (ప్రకాశముగా) రాజకుమారా! తొందరపడకుము. నేను నీకు శత్రుడఁగాను. మద్రదేశంబు బాలించు అశ్వపతిని. నీకండ్రియగు ద్యుమత్సేను దర్శింప నరుదెంచితిని. మా రాత్రిమయునకుఁ దోవఁజూపుము.

సత్య—అయ్యా! నాతొందరకు క్షమింపుము. దుష్టుండగు చిత్రకేతుఁడు మాపైకెత్తివచ్చుచుండ నేమోయని యట్లొనర్చితిని. (ఇంతకు యూరకుండి స్వగతము) ఈతఁ డిచ్చోట కిప్పు డరుదెంచుట కేమి కారణమోగదా.

తే॥ గీ॥ ఏనువలచిన సావిత్రి • కితఁడు తండ్రి
గాఁడె; యితనరాకకు నేమి • కారణంబొ?
యదరుచుండెను గుడికన్ను • నొదవుశుభ మ
దేదొ చిత్తమున కింతయు • నెఱుఁగరాదు॥

(ఎదుటఁజూచి) అదుగో! ఈతడు కుటుంబముతోఁగూడ వచ్చి యున్నాఁడు. (ఆశ్చర్యము నటించి) ఆహా! ఏమి నాపూర్వ పుణ్యము!

తే॥ గీ॥ అదుగో! వలచిన సావిత్రి • యరుగుదెంచె
గన్నులుండిన ఫలమును • గాంచినాఁడ
గరితమిన్నను నేఁ జూడఁ • గలనొ లేనొ
యనెడు సంశయంబంతయు • నంతరించె॥

నాల—(అశ్వపతినిఁ జూచి) అయ్యా! నీవు మద్రదేశమేలు భూపతివా! ద్యుమత్సేనునితో నేమిపనియుండివచ్చితివో యెఱుంగవచ్చునా?

అశ్వ—అస్మత్పుత్రికా వివాహార్థమై యరుదెంచితిని.

గాల—సత్యవంతునితో (రహస్యముగా) మిత్రమా! నీకొక్కతె నేతిరోఁ బడినది.

సత్య—గాలవా! వీరికి మన యాశ్రమమును జూపుచును రమ్ము. (అశ్వపతినిఁజూచి) నృపాలపుంగవా! ఇటు రమ్ము.

[నిష్క్రమించుచున్నారు.]

రంగము:—[ఆశ్రమమున ద్యుమత్సేనుఁడు, భద్రాంగి]

ద్యుమ—(భద్రాంగిం జూచి) సతీమణీ! మన కష్టము లెప్పటికి నమాప్తియగునో కదా! భగవంతుని యెడల మన మేమపరాధము గావించినామని మనల నిట్టి దుర్గతిపాలు గావించెనో యెఱుఁగరాదయ్యెను. ఇది యంతయు మన పురాకృత కర్మఫలము కాబోలు. కాకున్నచో మన కీ యవస్థ లేల సంభవించును?

సీ॥ కంటకావృతమైన • కానన శ్రేణులే
ఘనమైన యుద్యాన • వనములయ్యె
భవ్యతాపసులుండు • పర్ణశాలలె యిప్డు
రమణీయమౌ మంది • రంబులయ్యె
ఘోరభయంకర • క్రూరమృగంబులే
మనయాజ్ఞ నెఱవేర్చు • మంత్రులైరి
కఠిన పాషాణ ప్ర • కరములె మోదంబు
నమకూర్చు పూవుల • శయ్యలయ్యె

తే॥ గీ॥ హా! యింకేమందు మనగతి • కతివమిన్న
కష్టముల నెన్నటికైనఁ • గడవగలమె
వనని వాసముపీడి పూ • ర్వపు సుఖంబు
లందఁగాఁగలమె తోచ • దయ్యెసకట॥

అయ్యో! అంధులమైయిట్లు దేహయాత్రఁ గడుపవలసివచ్చినదికదా! ఒరుల సహాయములేకుండ నొక్కయడుగైన వేవలకుఁ బోజాలము. ఎచట కెవ్వరువచ్చినది యెవ్వరైనఁ జెప్ప

నున్నచోఁ దెలియదు. ఈవార్ధకమునకుఁ దోడు గ్రుడ్డితనము గూడ మనల నావహించినది. రాజ్యభ్రష్టతకుఁగాని, ముసలితనమునకుఁగాని, యంధతకుఁగాని వగవను. కాని, బాల్యంబున ననేక పరిచారకులచేఁ బరిచర్యలందుచు, నెంతకన్నను నాకన్నను నెక్కుడు నెఱుంగని మనసత్యవంతుఁడు మనకై యెన్నియో శ్రమలందుచున్నాఁడుగదా! అతఁడు పడుచున్న కష్టములం జూచిన నా కడుపు తఱుగుకొని పోవుచున్నది. నాకు వార్ధకము వచ్చెను. ఇంక చిరంజీవి రాజ్యపదమున నిలిపి సౌఖ్యంబులందఁ దలంచితినిగాని, యీరీతిని భగవంతుఁడు మనల వెలలఁ బాలుచేసినాఁడు. ఇట్టి దుర్గతి యెన్నాళ్ళనుభవింపవలయునో!

భద్రా—నాథా! మన మీరీతిని జింతించినందువలనఁ బ్రయోజనమేమి యున్నది? మనమే చింతింపవలయును, మనమే యోదార్చుకొనవలయును. సత్యవంతుని భగవంతుఁడు మనకుఁ బ్రసాదించి యుండుటచేత మనకీ కష్టములు కష్టములుగా గనుపించుటలేదు. కుమారుని పితృమాతృభక్తి శ్రీరాముని మించియున్నది. మన కే సమయమున నేది కావలసియుండునో సమస్తమును నెఱింగి యాతఁడతిజాగరూకుఁడై మనకు సపర్యలఁ జేయుచున్నాఁడు. కానింక ఎప్పటికైన మన కష్టములు గట్టెక్కకపోవునా!

ద్యుమ—అట్టిభాగ్య మీనిర్భాగ్యుల కున్నదాయని సంశయింపుచున్నాను. (ఇంచుక యూరకుండి) ఎవరో మనుష్యుల యలికిడి వినవచ్చుచున్నది.

భద్రా—సత్యవంతుఁడు వచ్చుచున్నాఁడేమో!

[సత్యవంతుఁడు, అశ్వపతి, మాళవి, సావిత్రి, గాలవుఁడు ప్రవేశించుచున్నారు.]

సత్య—(తండ్రిని జూచి) తండ్రీ! నిన్ను జూచుటకు మద్రదేశాధీశ్వరుండగు నశ్వపతి తన భార్యయగు మాళవితోడను, సుతయగు సావిత్రితోడను వచ్చియున్నాఁడు.

ద్యుమ—నాయనా! ఏమి మనభాగ్యము! ఇప్పుడు వారెందున్నవారు?
సత్య—ఇదిగో వారు నీయెదుటనే యున్నారు.
ద్యుమ—అయ్యో! ఎంత నిర్భాగ్యుఁడను! చూచుటకుఁ గన్నులయినఁ లేవు. (అశ్వపతింజూచి) మద్రభూపాలా! ఇట గూర్చుండుము.
భద్రా—మాళవీ సావిత్రులారా! అట నాసీనలగుఁడు.
ద్యుమ—(అశ్వపతిం గాంచి)

తే॥ గీ॥ రాజరాజాధిమహారాజ • రాజునయ్యుఁ
దగిన గౌరవంబును జేయఁ • దగినస్థితిని
గాననంబులయందుంటి • గా యటంచు
మదినిఁ జింతించుచుంటిని • మానవేంద్ర!

అశ్వ—భగవంతుఁ డొనర్చినదానికి నీ వేమి సేయుదువు? మమ్ముల నన్యథా తలంచి మాకు నీవు గౌరవము సేయవలయునా? మేము నీవారము గామా? అందఱును గష్టములఁ గడచినవారేనా? కొన్ని దినములు చీకటియును, గొన్ని దినములు వెన్నెలయుఁ గాయున ట్లందరును సుఖదుఃఖము లనుభవింపవలసినవారే.
ద్యుమ—మే మందు కష్టములు పగవానికైన వలదు.

ఉ॥ కన్నులులేక యీకరణి • గాననమందు వసించుచుంటి మో
యన్న! యిటుల్; త్వదాగమన • మంచితమోదముగూర్చె మాకు సం
పన్నుఁడ వీవు మాదుగతి • భవ్యమదంబున గన్గొనక క్రమం
బెన్నక వచ్చినాడవు ని • జేశ్వరియుక్ జనుదేరఁ గూతుతోఁ॥

మహాదారిద్ర్యసాగరంబున మునింగి దిక్కులేనివారమై యీయరణ్యముననున్న మాక్షేమము నారయుటకు నీవుగాక మఱెవ్వ రరుదెంతురు? భూతలాధిపా! నీసిర్తైశ్వర్యమున కరుణకనేక వందనము లర్పించుచున్నవాఁడను. రాజ్యభ్రష్టత గలిగినను, నంధత్వము సంభవించినను, వానింగూర్చి చింతింపక

వంశవిస్తారకుఁడగు నీకుమారునిఁ జూచుకొనుచుఁ గాలము వెళ్ళఁదీయుచుంటిని.

అశ్వ—ద్యుమత్సేనా! కష్టము లెప్పుడును మనకు స్థావరముగా వసింపవు. ఇందులకై విచారింపకుము.

ద్యుమ—అశ్వపతీ! మీ రెచ్చటికిఁ బోవుచు నిచ్చటఁ గనుపించితిరి ఎఱుంగనగుదునేని యానతీయుము.

అశ్వ—రాజేంద్రా! మేమిచ్చటికే యరుదెంచితిమి. నారాకకుఁగారణంబెఱిఁగించెదను వినుము.

తే॥ గీ॥ ఈమె నాపుత్రి సావిత్రి • యేను జపము
చేసి సావిత్రివరమునఁ • జెందినాఁడ
గన్న నీమెను గోడలు • గాఁగ నీకుఁ
జేసి రాజలోకంబున • వాసిగాంతు.

ఇదియే నారాకకుఁ గారణము.

గాల—(సత్యవంతునిఁజూచి) మిత్రమా! వింటివా?

ద్యుమ—(అశ్వపతిఁజూచి) నరపాలా! నాతోఁ బరిహాసోక్తులాడుచుంటివో లేదో నేనూహింపఁజాలకయున్నాను. కాకున్నచో దరిద్రుఁడై యరణ్యమున మమ్ము సేవింపుచున్న నాకుమారున కిప్పుడు వివాహమేల?

సత్య—(తనలో) ఇందుకుఁ దండ్రిగా రంగీకరింపరాయేమి?

అశ్వ—(ద్యుమత్సేనుఁజూచి) నృపాలా! నేను బరిహాసోక్తులాడువాఁడనుగాను. నిశ్చయముగనే వక్కాణించితిని. నేను మీస్థితిఁజూచి యిచ్చుటలేదు. సత్యవంతునిగుణశీలములఁజూచి నీతో వియ్యమందఁదలంచితిని. అది యట్లుండనిండు.

తే॥ గీ॥ నీకుమారునకేగాని యే • రాకుమారుఁ
బరిణయంబాడ నంచును • బ్రతినదాల్చెఁ

బరమసుగుణాలవాల యీ • భాసురాంగి
సమ్మతింపుము దీనికై • త్మ్మాతలమునఁ

తే॥ గీ॥ దానములయందుఁ గన్యకా • దాన మరయ
సర్వవిధముల శ్రేష్ఠంబు • క్ష్మాతలేంద్ర.
దగిన నీసుతునకు నీమె • దానమిచ్చి
యశము నార్జించి వెలసెద • నవనిపాల!

సత్య—(స్వ) నేను మాట్లాడక యూరకున్నచో బాగుండదు. ఇట్లనెద గాక. (ప్రకాశముగా నశ్వపతింగాంచి) మద్రాధిపా!

మ॥ చతురంభోధిపరీతముద్రితమహీ • సామ్రాజ్యమున్ బూను నా
క్షితిపాలాగ్రణు లెందఱో గలుగ నం • శ్రీలెల్లనుం బాసి యీ
గతి ఘోరాటవియందు మౌనికరణిన్ • గాలంబు నుంబుచ్చు నన్
బతిగాఁ గోరివరించి వర్ నగరె భూ • పాలుర్ ధరాధీశ్వరా!

మాళ—(భద్రాంగినిఁజూచి అమ్మా! భద్రాంగీ! ఈసావిత్రి సత్యవంతునిదప్ప నన్యుల వరింపనని దీక్షవహించినది. సంపదలు లేవనియు, గానలనుంటిమనియు మీరు విచారింపవలదు. ఇందులకు నీ వనుమతింపవలయును.

ద్యుమ—(అశ్వపతిఁజూచి) నృపాలా! నాకు మఱియొక యోచనయేమియును లేదు. మేము నిరుపేదలమై యీయరణ్యమున తేక్కలు లేని పక్షులవలె నల్లాడుచున్నారము. నీ కుమారియా, మిగుల సుకుమారి ఎన్నఁడును నెండకన్నెఱుఁగదు.

సీ॥ మహనీయ మణిమయ • మందిరంబులనుండు
పడతి యెట్లు వసించు బర్ణశాల
హంసతూలికలందు • నలరారు పూబోడి
దర్భశయ్యను నెట్లు తనువుఁజేర్చు
పలయు నాహారంబు • వాంఛించి కైకొను
కాంత దుంపలను మె • క్కంగఁగలదె
పట్టుబట్టలఁగట్టు • భామాశిరోమణి,
నారచీరల మెయిన్ • దాల్పఁగలదె

తే. గీ॥ సంతతము బరిచారికా • సతులు గొలువ
దవరుచుండెడి లేమ యీ • వనములందు
భయద ఘోర శార్దూల ర • వముల వినుచు
నులికిపడి భయమందక • యుండగలదె?

మానసత్యవంతుని వివాహము జేసికొన్నందువలన నీమె యేమి సౌఖ్యంబు లందగలదు?

అశ్వ—రాజేంద్రా! ఈ విషయంబున నీ వావంతయు సందియంబంద వలదు. సాధుగుణశీలయగు నీమె పతిని దైవంబుగతి భావించు చు, మీ పరిచర్యల నేమఱక, మీతోఁబాటు కష్టసుఖముల నందును.

ద్యుమ—(కుమారునిఁజూచి) కుమారా! సత్యవంతా! వింటివిగదా యీ భూపాలచంద్రుని మాటలు? ఇందులకు నీయభిప్రాయ మేమి?

సావి—(తనలో) ఈతఁడే మని చెప్పునో? డెందమా! తొందరపడకుము.

అశ్వ—(సత్యవంతునిఁగాంచి) సత్యవంతా!

సీ॥ నినుజేర మనసార • నెఱిఁ గోరు సావిత్రి
నేలు మీ కరుణ భూ • పాలతనయ
నీకు సేవలఁజేయు • నిక్కంబుగాఁగోరు
సారసాక్షిని గావు • సదయహృదయ
నీవె దైవంబంచు • నిజముగా నమ్మెడు
కంజాక్షిఁ జేపట్టు • కలుషరహిత
నిన్నెగా కన్యుల • నేఁగోర నని చెప్పు
నీమంతినిం గొమ్ము • శిష్టచరిత
తే॥ గీ॥ నామనంబెల్ల నీయథీ • నంబు జేసి
తనరుడంచును వచియించు • తలిరుఁబోఁడిఁ

బరిణయంబాడి సుఖములఁ • బడయుమయ్య
రాజలోకంబు మిగుల హ • ర్షంబు నంద॥

నార—(ద్యుమత్సేనునిఁజూచి) మహారాజా! సిరిరా మోకాలొడ్డువారుందురా? తానంతటఁ దానరుదెంచి పిల్లనిచ్చెదనని వలుకుచుండఁగా మీరేమో కొమ్మమొక్క మాట్లాడుచున్నారు. సత్యవంతుని మాన మాతని యంగీకారమును జూచింపుచునే యున్నది. (అశ్వపతింజూచి) అయ్యా! అశ్వపతిభూపాలా! వీరివారితోఁ బనేమున్నది? పిల్లకును బిల్లవానికిని నిష్టమున్న జాలును. ఇంక మీరు సంశయింప నక్కరలేదు.

శా॥ శ్రీమంతుండు శుభప్రచారుఁడు దయా • శీలుండు పంచేషు రే
ఖామాధుర్యధురంధరప్రజ్వలశుభా • కారుండు, సం
గ్రామోద్దాముఁడు, శౌర్యశాలి, త్రిజగ • త్కల్యాణచారిత్రుఁడీ
భూమీశాగ్రణినందనుం డిక భవ • త్పుత్రికి గొను౯ భూవరా!

శైబ్యా—(పతిఁజూచి) ప్రాణేశ్వర! ముద్దుముద్దుగా మన కుమారునకుఁ బిల్లనిచ్చెదమని వీరువచ్చిరి. అందుకు మఱియొకతీరుగా మనము చెప్పుట భావ్యముగాదు. (మాళవింజూచి) అమ్మా! మాళవీ! మీయభిప్రాయ మెట్లున్నదో యట్లే కానిండు.

ద్యుమ—రాజేంద్రా! మాకున్న కష్టములఁగూర్చి జెప్పితిని. నీవన్యథాతలంపవలదు. నీయభీష్ట మెట్లున్నదో యట్లు కానిమ్ము. కాని, నీతో నొకటి చెప్పవలసి యున్నది. వివాహమునకు మేమీస్థితిలో మీనగరమునకు రాజాలము.

అశ్వ—నమస్తసన్నాహములతోడను నేనేవచ్చియుంటిని. నాతో భూసురులు గూడ వచ్చి యుండిరి. వారితోఁ దగిన శుభలగ్నమునుగూర్చి యాలోచించి వివాహకార్య మిచ్చటనే నెఱపెద. ఇంక మనము తత్ప్రయత్నమున నుండవలయును రండు.

సావి—(తనలో) నేటికిగదా నేను ధన్యనైతిని.

(అందరునిష్క్రమించుచున్నారు.)

---

[రంగము:—ఆశ్రమము. ప్రవే—అశ్వపతి, ద్యుమత్సేనుఁడు, మాళవి భద్రాంగి, సావిత్రి, సత్యవంతుఁడు, గాలవుఁడు]

అశ్వ—[సావిత్రినిఁజూచి] అమ్మాయీ! సావిత్రీ! సత్యవంతునిదవ్వ యచ్చల వివాహమాడనని తలంచిన నీతలం పొనఁగూడినది. నీ కనురూపుండగు వరుండు లభించినందులకు మాకును మిగుల సంతసమయ్యె.

గాల—అశ్వపతి రాజా! నీకూతురుయొక్క పూర్వజన్మ పుణ్యపరిపాకం బునజేసి సత్యసంధుండును, ధర్మమూర్తియు, పితృమాతృ భక్తిపరిపూర్ణుడును, బహ్మ్రతేజశాలియు, నిగర్వచూడామణి యు నగు మాసత్యవంతుఁడు నీకు జామాతయయ్యెను. నీకు కన్యాదానఫలము దక్కినది.

సీ. సర్వలోకానంద • సంపాదకకీర్తిచుఁ
 జావితోఁ గుసుమంబు • దనరినట్లు
నరనాథనందనీన • న్మాన్యమై శోభయు
 మాణికంబును నేక • మైనకరణి
శ్రుతి కనుకూలవ • ద్ధతిగల్గి వాగర్థ
 ములు పరస్పరమును • గలియుకీతి
జగదవనోత్సాహ • సన్నద్ధసంపద
 శ్రీసతియుఁ బతియుఁ • జెలగువరున

తే॥ గీ॥ వరలుదురుగాక సతతంబు • భవ్యభోగ
 భాగ్యసంతానకీర్తిప • వర్తితోడ
 ధరణియందున నాచంద్ర • తారకముగ
 సత్యవంత సావిత్రులు • తన్మకళత్ర!

ద్యుమ—బ్రాహ్మణోత్తముడవైన నీ యమోఘాశీర్వచనంబు ఫలిం చుంగాక!

మాళ—[సావిత్రినిఁజూచి] అమ్మాయీ! నీకుఁ దెలియనిసంగతు లేమి యు లేవు. అయినను గన్నకడుపగుటచేతఁ జెప్పుచుంటిని.

సీ॥ జనకుఁడైనట్టి య • శ్వపతికీర్తిరమకు
వెలలేనివన్నెను • బెట్టుమమ్మ
పతియె దైవమటంచు • భావించి సతతంబు
చిరకీర్తిగాంచుచు • జెలఁగుమమ్మ
భవదీయగుణములు • పరికించి తోడిభా
మలు నేర్చుకొనునట్లు • మెలఁగుమమ్మ
అత్తమామలసేవ • నాత్మలో మఱువక
వారిసేవింపుచు • బరఁగుమమ్మ
తే॥ గీ॥ మనకు నిలువేల్పుసావిత్రి • మఱువకమ్మ
సత్యమేజయమనుమాట • జరుపుమమ్మ
కష్టసుఖములు సమముగాఁ • గడపుమమ్మ
పృథ్వీపతిపుత్రిననుచు గ • ర్వింపకమ్మ.

అశ్వ—పుత్రీ!

మ॥ అనిశంబుఁ బతిసేవఁజేయుచుఁ దదా • జ్ఞాయత్తచిత్తాబ్జలై
యనువర్తించి పతివ్రతామణులుగ • ఖ్యాతిన్ భువిం గాంచి రా
యనఘస్త్రీలు సద్గుణాఢ్యలనసూ • యారుంధతీభామలం
గని నీ వట్లొనరించి కీర్తిని గొనం • గాఁజెల్లు మెచ్చన్ జనుల్.

అమ్మా! పతిసేవయే కాంతకు భూషణము. దానిచే సాధింపఁబడని కార్యమేదియులేదు. సమస్తమును నీకుఁ దెలిసియే యున్నది.

సావి—తల్లిదండ్రులారా! మీయాజ్ఞలను నేను శిరమున ధరించెదఁ గాక! కాని నన్నుఁగని, పెంచి పెద్దదానిగఁ జేసిన మిమ్ముల నెడఁ బాయవలసి వచ్చునుగదాయని నేను విచారింపుచున్నాను.

మాళ—తల్లీ! నీవు దీనికై విచారింపవలదు. లోకంబున స్త్రీలందఱకు నిట్టిది సహజమై యున్నది. నాలుగురోజుల కొకసారి నీ కుశలము విచారించి వచ్చుచుండుటకు దగినసేవకుల నియమించెదను. ఇంకొక్కటిమాత్రము నీకుఁ జెప్పుచున్నాను.

తే॥ గీ॥ కాననము దీని నగరంబు • కాఁగ, బర్ణ
శాల మేలైన మణిమయ • సౌధముగను
కష్టనముదయంబెల్ల సౌ • ఖ్యమ్ములుగను
నాత్మఁ దలపోసి ముదమున నలరవలయు॥

(భద్రాంగిఁ జూచి) అమ్మా! భద్రాంగిదేవి! పెంచి పెద్ద దానిగఁజేసి మీచేతులలోఁ బెట్టితిని. ఇంక నీమెను రక్షించు భారము మీదై యున్నది.

భద్రా—తల్లీ! నీ పుత్రికను నాప్రాణములతో సమానముగ నరసి రక్షించెదను. ఈమె విషయమై నీవు బెంగఁగొనవలదు.

అశ్వ—(సత్యవంతుఁ జూచి) సత్యవంతా! నిన్నుదప్ప నన్యుల వరింపనని వ్రతిన వహించిన యీమె నిన్నుఁగైకొన నోచినది. ఇప్పు డీమెను నీ చేతులయందుఁ బెట్టితిని.

ఉ॥ ఆకలిఁగొన్నఁ దా నడుగ • దన్నము, గుత్తుక యెండియుండినం
గైకొనఁబోదు దాహమును • గన్గొని మేమె యొసంగగావలెన్
శ్రీకర! సత్యవంత! గుణ • శేఖర! నిర్మలచిత్తయైన యీ
రాకశశాంకబింబముఖి • రమ్యచరిత్రను నెట్లు బ్రోతువో॥

సత్య—మామగారూ! వివాహకాలమున నగ్నిసముఖమున నెట్టి బాసలు నాచేతఁ జేయఁబడినవో, యట్టివానికి నేను బద్ధుడనై యుందునని తలంపుఁడు.

అశ్వ—(ద్యుమత్సేనునిం గాంచి) నృపచంద్రా!

తే॥ గీ॥ కాంత యీమె నీకోడలై • గ్రాలె నిపుడు
నీసుతుఁడు సత్యవంతుపైఁ • నెలవుపేర్మి
నెఱపుమీ దీనిపై నీవు • నిశ్చయముగ
జంతవిడనాడి పురికిఁ • జేరువాడ•

ద్యుమ — మాకు సత్యవంతుఁ డొకటియు, నీమె యొకటియునా! మీారిట్లు చెప్పనక్కర లేదు.

అశ్వ — (సత్యవంతుని జూచి) ఇంక మేము ప్రయాణసన్నాహము జేసికొనవలయునుగదా! రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.





# సావిత్రి నాటకము.

## తృతీయాంకము.

రంగము:—[ఆశ్రమమున నొంటిగా సత్యవంతుఁడు ప్రవేశించును.]

సత్య—(స్వగతము) ఆహా! ఈ దుర్దినము లింకను మమ్ము వదలిపోవు కాబోలు! నామాట కేమి, నేను బుద్ధియెఱింగిన నాటనుండియు నరణ్యములందే పితృమాతృచరణసేవానక్తుఁడనై యుంటిని. కాని సావిత్రినిఁ జూచిన నాకెంతయు విచారమగుచున్నది.

సీ॥ పరిచారికాజనుల్ • నిరతంబు కొలువంగ
బరమసుఖంబందు • భాసురాంగి
యిష్టమృష్టాన్నంబు • నింపార భుజియించి
భోగియై బొల్చెడు • పూర్వబోఁడి
చేటీజనంబులు • చేరి వెన్వెంటరా
వనముల విహరించు • పద్మనేత్రి
భాసురమణిమయ • ప్రాసాదములయందు
హంసతూలికలందు • సలరు సతివ
తే॥ గీ॥ ఎండకన్నను నెఱుఁగని • యింతిమిన్న
కటకటా! నాకతంబున • కానడవుల
బడగరానట్టి కష్టముల్ • పడుచునుండె
జూచి భరియింపకుంటిని • సుదతి నిపుడు॥

అశరదిందుప్రతిమానబింబవదన, అనరసీరుహాక్షి, అకోమల సుకుమారశరీర పమునవస్థలను నేను జూడలేకయుంటిని. తల్లి దండ్రుల సేవలయందు నేనేమి కష్టపడుదునోయని తలంచి, నాకు శ్రమకలుగకుండ ననుదినంబును వాకంటె ముందుగా లేచి, వారలయెడఁ జేయవలసిన కృత్యంబులన్నియు జేసి యనంతరము నాసేవయందుఁ గూడ నేమరకయున్నది. ఈమె నతిముసఁ దమ వంశము పావనంబైనదని మాతలిదండ్రులు సంతసించుచున్నారు. ఇన్నిటికేమి, మాఱ్రసత్వ భయంకర మైన యీ మహారణ్యావాసము నగరవాసమనియె తలంచు చున్నది. ఈ పర్ణశాల తనకు దివ్యమందిరమువలె భావించు చున్నది. ఈకఠినపాషాణవేదికలు తనకుఁ బూవుల సెజ్జవలె నెంచుచున్నది. మాకొఁ బనుకష్టము లన్నియు సుఖముగా భావించుచున్నది. అహా! ఉత్తమస్త్రీయుప నిట్టిదేకదా!

మ॥ పతిభక్తిన్ సుజనానురక్తిహితవా • క్యాంచిత్యశక్తిన్ రమా
సతికిన్ దోడనఁజాలి సాధుసుమన • స్సంస్తుత్యమానంబనా
రతవర్ధిష్ణువు నయ్యె మాపమహిమన్ • రంజిల్లి యజ్ఞాంగనా
జత గావర్ధిలు నీసరోజముఖి నె • న్నం శక్యమే యొక్కరికిన్॥

నాపూర్వపుణ్యవశంబున నా కిట్టిభార్య లభించెనని నేను గర్వింపవలసియున్నది. (ఎదుటఁజూచి) అదుగో! నా మనోధనంబగు సావిత్రి యిట్లే వచ్చుచున్నది.

తే॥ గీ॥ పసిఁడిచేలంబు ధరియించు • పడతిమిన్న
నాసిమిత్తమిదా తెలుపున • నారచీరఁ
దాల్చి మానికన్యక వోలెఁ • దనరుచుండె
ధాతవ్రాతను నెవ్వారు • దాటగలరు॥

ఈమె మృదుభాషణము లేమి! ఈవినయాదిగుణము లేమి! ఈమె సేవలేమి! మా రాజ్యభ్రష్టతను, వనవాసాయానమునుగూడ మఱపించుచున్నవి.

సావి—(ప్రవేశించి తనలో)

తే॥ గీ॥ భాగ్యమన్నను నాదిపో • భాగ్య మరయ
స్వాంతమున నేను గోరిన • సత్యవంతు
బతిగాయుంబొందితిని దేవి • కరుణ వలన
కలరె నను బోలు ధన్యులు • క్ష్మాతలమున॥

(ఎదుట జూచి) అదిగో! నాసునోమాసం జేసియో దీర్ఘాలోచనము సేయుచున్నాడు సమీపించెదగాక! (సమీపించి) ప్రాణేశ్వరా!

సత్య—సతీమణీ! ఇప్పటికెట యరుదెంచితివి?

సావి—అత్తమామలకుఁ జేయవలసిన పరిచర్యలఁ జేసి, యాశ్రమమునఁ గార్యము లన్నియుఁ జక్కబెట్టి నీ వెచ్చోట కరిగితివో యని యరయుచు వచ్చితి. (ఇంచుక యూరకుండి) నాథా! నీ వేలకో దీర్ఘాలోచన తత్పరుఁడవై గానుపించుచున్నావు. కారణంబరయవచ్చునా?

సత్య—నాకు నీవిచారము నిప్పు డుండు లేదు.

సావి—దేవా! అట్లు సెలవిచ్చెదరేమి? నామూలముననే నీకు విచారమా! నేను నీయెడ బుద్ధిపూర్వకముగ నెట్టి యపరాధమును జేసియుండ లేదు. తెలియక యేమైన గావించి యున్నచో నయ్యది తెలిపిన సవరించుకొందును.

సత్య—రమణీ! నీవు నా యెడల నెట్టి యపరాధమును గావించియుండ లేదు.

ఉ. కోమలి బేలకాచబడు • గుంజపదారి విధానమున్న న
న్నీమహిఁ బెండ్లియాడి, సుఖ • మింత యెఱుంగక యిట్టిలీల నా
ద్దామవనాళి నుంటివి, ము • దంబున వేతొక భూరి రాజ్య ల
క్ష్మీమహనీయుఁగై కొనిన • కెంపవు నా యిటువంటి కష్టముల్॥

“సత్యవంతుఁడే నామనోహరుఁడు; అతనిం దప్ప నన్యులను వరింప”నని నన్ను వివాహమాడి నీవుపడుచున్న సుఖములివియే కదా! ఇట్టి మహాకష్టములఁ బొందుచున్న నిన్నుజూచిన నాకు విచారము గాక సంతోషము గలుగునా?

సావి—మనోహరా! ఇదియా నీకుఁగల్గిన విచార కారణము? అట్లయిన నీవు నన్ను గూర్చి విచారింప నవసరము లేదు. చంచలంబగు రాజ్యలక్ష్మినిగాని, యశాశ్వతమగు భోగంబులను గాని చూచి నిన్ను వరించ లేదు. నీతోఁబాటు కష్టసుఖముల నందుటకే నినుఁ బరిణయంబాడి కృతార్థురాలనైతిని. నాకు నీపాదసేవతప్ప తక్కిన దేనియు నవసరము లేదు. కష్టము వచ్చినప్పుడు చింతింపక, సుఖము గల్గినప్పుడు సంతసింపక, యెప్పుడును నొకతీరున నుండువారే ధన్యులు. నగరంబున నుండి, మహాభోగములందుచు నది చాల దిది చాలదని చింతింపుచుండుట కన్న నాకీ యరణ్యవాసమే పరమసుఖదంబుగ నున్నది.

సత్య—అన్నులమిన్నా! అమృతమును స్రవింప జేయుచున్న నీమృదు మధుర వాక్యములు నాకెంతయు నానందముఁ గొలిపి, కష్టముల మఱపించుచున్నవి.

సావి—(స్వగతము) అక్కటా! నేను సత్యవంతుని వివాహమాడి సుఖముసఁ బొందుచుఁ గాలమును మఱచిపోయితిని. నారదుఁడు వచించిన ప్రకారము నీతని యాయుర్దాయమిక మూఁడుదినములుమాత్రమే యున్నది. ఇంక నే నీతని నొకనిమిషమైన నెడబాయక యీ మూఁడు దినములను నుపవసించి యిష్టదేవతయగు కాత్యాయనీదేవిం గొల్చుచుండవలయును. ఆహా! సౌఖ్యమన్నది దేహమును మరపించును గదా. ఇంక నేను భక్తిపూర్వకముగా సమస్త దేవతలను నారాధింపవలయును. (అంబనుద్దేశించి)

శా॥ ఓ కాత్యాయని! నిత్యమంగళకరీ! ♦ యోకాంభవీ! పార్వతీ!
యోకాళీ! హిమశైలజా! గణనుతీ! ♦ యోపాపవిధ్వంసినీ!

పాకారిప్రముఖామరార్చితమహా • పాదద్వయీ! శాంకరీ!
నాకాంతుర్గ గృపనేలుమీయని నిన్నే • గాంక్షింతుఁదాక్షాయణీ!

సత్య—(సావిత్రిం గాంచి) సతీ ! ఇంతకు ముందు జరునవ్వులొలుకు చున్న నీమొగం బింతలోనే వాడిన దేమికారణము?

సావి—(తనలో) నాచిత్తమున నీతని విషయమై గలిగిన సంతాప మొక్కింతయు బయలు పెట్టరాదు. (ప్రకాశముగా) నాథా! నీకట్లుగనుపించినది కాఁబోలు. నీచెంతనున్న నాకువిచారమేల?

(లోపల—అమ్మా! సావిత్రీ)

సత్య—అదిగో! అమ్మగారు పిలుచుచున్నారు. పోవుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

---

రంగము:—(ఆశ్రమమున—ద్యుమత్సేనుఁడు, భద్రాంగి, సావిత్రి)

భద్రా—(సావిత్రిఁజూచి) అమ్మా! సావిత్రీ! మహారాజ పుత్రికవై పెక్కుభోగంబులందు నీవు, కాలస్థితిని(బట్టి దరిద్రులముగా మారిన మాయొద్దనుండి యనేక కష్టములఁబడుచుండుటయే గాక, శుష్కోపవాసంబున శరీరమేల యీరీతిఁ గృశింపఁ జేసికొందువు? రెండుదినంబులనుండి భోజనంబొల్లకయిట్లు దీక్షనిష్ఠతో నుండుటకుఁ గారణమేమి? తల్లీ! ఈపూట భోజనము సేయుము.

సావి—అత్తగారూ! నేనిష్టదేవతయగు మహాదేవింగూర్చి త్రిరాత్రోపవాస వ్రతమును బూనితిని. ఈరాత్రి యొకటిగడచినచో వ్రతము బూర్తియగును. రేపె వాల్లవదినం బగుటచే నుదయంబునఁ బారణఁ జేసెదను.

ధాత్రి—అట్లయిన సతీశిమతోఁ జేయు నీవ్రతమునకు మేము భంగము గలిగింతుమా!

(సత్యవంతుఁడు—ప్రవేశము)

సత్య—(తనలో)

సీ॥ అనుదినంబును వెంట • వఁజేరుచుండెను
నాతి రాకుండె నె • న్నాళ్ళనుండి
మనసిచ్చి మాటాడు • మానవతీమణి
మధురసంభాషణ • మానియుండె
పెంపుడు లేళ్ళకుఁ • బ్రీతి నన్నము పెట్టు
మగువ దాని నొసర్ప • మఱచియుండె
శారికాసమితిని • సంతోషమునఁ జూచు
తరుణి వాని దెసకు • నరుగకుండె
తే॥ గీ॥ మగువయెట్లున్న నత్తమా • మలసపర్య
మాత్రము మనంబులోన నే • మఱకయుండె
రెండునాళ్లయ్యె నుపవాస • ముండి లేమ;
కారణ మదేమొ దీనికి • గానరాదు॥

ఈ తరుణీశిరోమణి నేటికి భుజించి రెండు దినము లయినది. ఇట్లుండుటకుఁ గారణము నేనేమని యూహింపగలను? తన హృదయమున నభిప్రాయ మొక్కింతయైనను బయలు పెట్టక యీమె యతి నిష్ఠాగరిష్ఠయైన పరమయోగిని చందమునఁ గన్పట్టుచున్నది. ఈమెను జూచిన నాకెంతయు జాలి కలుగుచున్నది. పస్తేఁడన్నము దినుమని యెంత బలవంతపఱచినను దినకున్నది. ఫలాహారమైన నొల్లకున్నది. నీరంబులఁ ద్రావకయున్నది. నిద్రకు దూరమైనది. ఆహా!

తే॥ గీ॥ పడతినెమ్మోము నిశయందు • బద్మమట్లు
వాడియుండెను కఠినోప • వాసమునను

అఖిల సౌఖ్యములందుచు • నలరునట్టి
యువిద లిట్టి కష్టంబుల • కోర్వఁగలదె॥

(ఆలోచించి) నేను ప్రస్తుత కార్యంబును మఱచితిని. ఆశ్రమమున నింధనములు లేవు. గొడ్డలిఁ గైకొని యరణ్యమున కేఁగి కట్టెలఁ దేవలయును. (తండ్రిని సమీపించి) తండ్రీ!

ద్యుమ—కుమారా! వచ్చితివా! ఎచ్చటికిఁ బోయియుంటివి?

సత్య—ఈ యాశ్రమప్రాంతముననే మన హరిణమును మేపుచుంటిని. (ఇంచుక యూరకుండి) తండ్రీ! నే నింధనములకై యరణ్యంబులకరిగి వచ్చెదను. మీరు జాగరూకులై యుండుఁడు.

ద్యుమ—వత్సా! పోయిరమ్ము. మనయవస్థ యిట్లు వచ్చినది.

సావి—(తనలో) నారద మునీంద్రుఁడు వచించిన ట్లీతని గతువుదినంబు నేఁడేయై యున్నది. నాసమస్తదేవతారాధన పూర్తియైనది. ఇప్పు డీతఁ డరణ్యమునకుఁ బోవుచున్నాఁడు. నేఁడీతని నెంతమాత్రమును విడిచి యుండరాదు. కావున నేనుగూడ నీతని వెంట నరిగెదఁగాక. (ప్రకాశముగ సత్యవంతునిఁజూచి) ప్రాణేశ్వరా! నేఁడు నీతోఁగూడ నరణ్యమున కరుదెంచుటకు వేడుక యగుచున్నది. కావున నన్నుఁ గొనిపొమ్ము.

సత్య—రమణిమణీ! నీకోరిక యతి స్వల్పమయినదే. కాని.

మ. ఉపవాసంబున డస్సియుంటివిగదా • యుగ్రాటవిం జేరగాఁ
జపలాక్షీమణియెంతయుం శ్రమయగుం • జాల్చాలు నీకోర్కెదు
ష్టపథంబందుఁ జరింపఁజాల విటుక • ష్టంబేలపొందంగ నే
నిపుడే వచ్చెదఁ దప్ప కీవు వినుమా • యేణాక్షి నామాటలం॥

సావి—నాథా! ఆవిపినము సమస్త తరులతా శోభితమై యొప్పారుచుండును. నే నెన్నఁడును నిన్ను గోరియుండలేదు. నేను నా ముద్దు నీవు తప్పక చెల్లింపవలయును.

సత్య—అమ్మలమిన్నా నీవు వచ్చినచో నా కేవిధమయిన భారము ను లేదు. ఉపవాసమున మిగుల డస్సియుంటివి గదా యని యట్లు వచించితిని.

సావి—

తే॥ గీ॥ భవ్య భవదీయ పత్పాద • పద్మసేవ
మఱఁగియుండిన నాకు నే • కొఱత లేదు;
కలుగునే నా కుపవాస • కారణమున
బడలిక శరీరమందు నో • ప్రాణనాథ!

నన్నుఁగూర్చి సంశయింపక వెంట నరుదెంచుటకు సెలవిమ్ము.

సత్య—అట్లే కానిమ్ము. నీయత్తమామల యనుజ్ఞఁ బొంది రమ్ము. నేను గొడ్డలియుఁ దాడును బుచ్చుకొని వచ్చెదను.

(నిష్క్రమించును.)

సావి—అత్తమామలారా! మీ కుమారునివెంట నరణ్యమున కరుగుటకు నానతిండు.

ద్యుమ—అమ్మా! అతఁడు నపడుదువను సంశయము దప్ప మఱేమి యును లేదు. మగనితో నరుగుటకుఁ గుతూహలము జనించిన నిన్ను వారించుటకు మాచిత్తము సమ్మతింపదు. కావునఁ బోయిరమ్ము.

భద్రాం—తల్లీ! సావిత్రీ! అరణ్యమునఁ దడవుసేయక సత్వరమ్ముగ రమ్ము. నిన్నుఁగాని సత్యవంతునిఁ గాని యొక్క నిమిషము జూడకుంటినేని నాడెందమున నాందోళన జనించును. భద్ర ముగ బోయిరమ్ము. (అందఱును నిష్క్రమింతురు.)

---

రంగము—[అరణ్యము-ప్రవేశము:
సత్యవంతుఁడు, సావిత్రి.]

సత్య—రమణీమణీ! ఈ యరణ్యప్రదేశ మెంత రమణీయముగ నున్నదో గంటివా? ఇందలి వృక్షములు మార్గాయాసమున డస్సియున్న పాంథులకు నెంతయుఁ జల్లని నీడ నిచ్చును గదా! ఈ యరణ్యమంతయు స్వాభావికమైన సౌందర్యమున మించి యున్నది. ఇందలి విహార మతిప్రమోదావహము గదా. కావలయునని నాటించిన పుష్పతరులశోభాయమగు నుద్యానవనమందలి విహారమింత సౌఖ్యజనకముగ నుండదనుమీ! అదిగో! ఆ లతాకుంజంబు లెట్లు వరలుచున్నవో! మన మొక్కింత కాల మిం దాసీనులమై చల్లగ వీచుచున్న యీ మందమారుత సౌఖ్యము ననుభవింతమా? ఇటుచూడుము, ఈ రెండు కొండల నడుమనుండియు నా నది యెట్లు ప్రవహించుచున్నదో!

సావి—(తనలో) ఆహా! ఈపుణ్యమూర్తి, ఈ సుగుణాలవాలుఁడు తనకు సంభవింపనున్న యాపద నెఱుంగక యిట్లు వచింపుచున్నాఁడు, ఇట్టి సమయమున నాకీ వనవిహారమునం దిచ్ఛ జనించునా! (ప్రకాశముగా) నాథా! ఆనదివంకఁ జూడుఁడు.

శా॥ గాంగేయప్రభఁ దాల్చి సాయమున రం • గత్తుంగభంగార్భటీ
సంగంబైన ప్రవాహమందున రుచి • స్ఫారుండు సూర్యుండు చ
క్కంగన్పట్టెడు భూమికన్నియ కలం • కారంబుగా జేయఁ బె
ల్కంగల్పించిన కుంకుమోయనఁగ రా • కాచంద్రబింబాననా॥

ఇంకఁ ద్వరలోనే సూర్యుం డస్తగిరిఁ జేరఁగలఁడు. కావున మనము త్వరగ నాశ్రమమున కేగుదము. మనము వచ్చి చాల సేపైనది. వనవిహార మిఁక జాలును. మీ తలిదండ్రులు మనకై వేచి యుందురు. రమ్ము.

సత్య—చెలీ! నే నీ వనవిహారసౌఖ్యము ననుభవించుచుఁ గట్టెలవిష

యమై మఱచితిని. అదిగో! మన కెదురుగ నొక యెండిన వృక్షము గనపించుచున్నది. నేను దాని నీ గొడ్డలితోఁ జీల్చి కట్టియలుగాఁ గొట్టి మోపుఁ గట్టకొని సత్వరమ్ముగ వచ్చెదను. నీ వీ చెట్టుక్రింద నుండుము.

సావి—నాథా! శీఘ్రముగ రావలయును.

సత్య—ఇదే వచ్చెద. (నిష్క్రమించును)

సావి—(తనలో) అక్కటా! ఏమి కారణమోగాని యిప్పుడు నా యెడమ కన్నదరుచున్నది. ఏమి యశుభము వాటిల్లునోగదా! మేము వచ్చునప్పుడు మార్గమున నన్నియు నపశకునములే సంభవించినవి; కాని ధైర్యమవలంబించి వచ్చితిని. సమస్త దేవతలును నా నాథుని రక్షించెదరు గాక!

సత్య—(వృక్షముయొద్దనుండి) హా! ఏమిది! సహస్రమదగజసత్వుండనైన నే నిప్పుడు మిగుల బలహీనుఁడనగుచు గట్టియలఁ గొట్ట లేకుంటిని. చేత గొడ్డలి నిలుచుటలేదు. సకలదిక్కులు, లోకము, భూమ్యాకాశములు నంధకారబంధురమై గానుపించుచున్నవి. ఏమి! ఈతలనొప్పిబాధ! అబ్బా! నిలువఁజాలక యున్నాను. హా! సుదతీ! (గొడ్డలి నేలపై బడవేయును.)

సావి—నాథా! ఇదే వచ్చుచుంటిని. (సమీపించి) ప్రాణేశ్వరా! ఇదేమి ఇంతలో నిట్లయితి వేమి?

సత్య—(దీనస్వరముతో) అయ్యో! సావిత్రీ! నా శరీరమంతయుఁ గంపమెత్తుచున్నది. నాయొడలు వశమగుటలేదు. సర్వేంద్రియ సంచారము తగ్గుచున్నట్లున్నది. అబ్బా! తలనొప్పిబాధ భరింప శక్యముగాకున్నది. శీర్షమంతయు గొడ్డలితో సలుగగొట్టుచున్నట్లున్నది! అక్కటా! నిలువజాలను. ఇంక మాతల్లిదండ్రులను జూడను గాబోలు! సావిత్రీ! ఇంక నీకు నెవ్వరుదిక్కు? అంధులైన తల్లిదండ్రు లెక్కడ?

సావి—(తనలో) ఆహా! ఎంతలో నెంతపుట్టినది. ఇదినాయంతమునకుఁ గారణముగా బోలు! (ప్రకాశముగా) నాథా! ఇంచుక నీవు నా యంకతలమున నీ శిరముఁ జేర్చి పరుండుము. కొంత బాధ తగ్గఁగలదు.

సత్య—అయ్యో! ఎక్కడి బాధ తగ్గుట! (సావిత్రితొడపైఁ శిరముజేర్చి) నాలుక లోపలికి దిగిపోవుచున్నది. మాటవచ్చుట లేదు. కన్నులు మూసికొని పోవుచున్నవి. అదిగో నీలజీమూత సన్నిభశరీరుండగు నొక్కడు నన్ను బాధించుచున్నాఁడు. అయ్యో! ప్రేయసీ! ఏమిగతి? (మాటలేక పడియుండును.)

సావి—హా! నా కేగతి యేమి! నే నిప్పు డేమిసేయుదును! పార్వతి (నుద్దేశించి) హా! భవానీ!

చ॥ నిరుపమభక్తిబూనుచును • నిత్యముఁ నాదగు చిత్తమందు నీ
చరణపయోరుహంబులను • సంతసమేర్పడఁ గొల్చుచుంటి నీ
వరకరుణారసంబునను • బాలనజేయుచు నిష్ట నామనో
హరునకు గూర్పుసౌఖ్యమును • నాపదఁబొందితినీకు మ్రొక్కెదన్॥

(సత్యవంతునిపైఁ జేయివైచి) ఏమిది! శరీరమంతయుఁ జల్లబడుచున్నది. నాథా! నాథా! (ఇంచుక యూరకుండి) అయ్యో! మాటలాడవేమి? అక్కటా! నీవు నా దెసఁ జూడకయున్నచో నాగతి యేమికావలయు? నీవు లేని నాకీ జన్మమేల? పోనిమ్ము! వివాహమాడిన నన్ను జూడకున్నను వృద్ధులై, యంధులై, నిన్నుఁ జూచుకొని యరణ్యమున దినములఁ బుచ్చు నీ తల్లిదండ్రుల మఱచితివా! నీవుగాక వారికెవ్వరు సేవ జేయుదురు? (ఇంచుక యూరకుం) ప్రాణేశ్వరా! (అని పిలిచి) అయ్యో! ఇంకెక్కడి ప్రాణేశ్వరుఁడు!

సీ॥ అర్ధాంగినౌ నన్ను • నడవిపా ల్గావించి
యరుగుట ధర్మమా • వరగుణాఢ్య!

తల్లిదండ్రులసేవ • యెల్లమందు మఱచి
దీర్ఘనిద్రనుగంటె • ధీరచరిత!
ఎన్నంచు నిన్నుఁ బాసి • యెఱుగని హారిణంబు
దానికి దిక్కేమి • ధర్మమూర్తి
మునిబాలకులమాట • మనమందు విడనాడి
చనినాడవే యిట్లు • సదయహృదయ!
తే॥ గీ॥ హా! మనోనాథ! జితచంద్ర • హాసుచరిత!
హా! ద్యుమత్సేననందనా! • హా! సురూప!
హా! నిరంతరకరుణామ • యాంతరంగ!
సకలసద్గుణవంత! హా! • సత్యవంత॥
అక్కటా! నారదమునీంద్రుఁడు చెప్పిన వాక్యములు నిజము
లయ్యెనే! ఇప్పట్లు నిన్ను రక్షించువారెవరు? నాదేవతారాధనమంత
యు వ్యర్థమయ్యెనే!
సీ॥ నిర్మోహమను భూతి • నింబెట్టి సమభావ
కౌపీనవసనంబు • గరిమఁజాల్చి
సత్యకమండలిఁ • జక్కగా జేపట్టి
సత్కృపారసమను • జలముఁబోసి
దాయలార్వురను దు • ర్దాంతుల బంధించి
విజ్ఞానపాదుకల్ • వేడ్కదొడిగి
సంసారమనెడు ని • స్సారకాననము వి
రాగపరశువునఁ • బ్రచ్ఛేదివైతి
తే॥ గీ॥ సచ్చిదానందమూర్తివై • చనుచునుంటె
ధరణి నఖిలప్రదేశముల్ • దాటిదాటి
శాశ్వతానందపదవిని • సౌఖ్యమంద
సకలసద్గుణమూర్తి యో • సత్యమూర్తి!
(యముఁడు ప్రవేశించును.)
యము—(పాశముచే సత్యవంతుని సమీపించును.)

సత్య—హా ! హా ! (మృతుఁడగును.)

సావి—(సత్యవంతునిశిరము నెమ్మదిగా నేలఁబెట్టి లేచి యముని జూచి) ఓయీ ! మహానుభావా ! నీ వెవ్వడవో తెలియదు. ఇదిగో నమస్కరింపుచున్నాను. నీ వెవ్వరవు ? ఎందుల కీ య్యెడ కరుదెంచితివి ?

క॥ వరుడిటు తలబాధకతన
ధర పైఁబడెఁ దాళలేక • తద్దుఃఖ మదిలోఁ
గరుణఁదలంపుచు మందున
బరిరక్షణసేతువేమొ • పలుకుము దేవా!

నీ రూపము జూడగా నొక్క దివ్యపురుషుండవని తోచుచున్నది. ఎవ్వరవైననేమి నాపతిప్రాణము రక్షింపవేడెద.

యమ—తన్వీమణీ! నీవు మద్రరాజపుత్రికవనియు, నీతను భవన్నాథుండగు సత్యవంతుడనియు నాకు దెలియును. నే నీతనిని మందిచ్చి రక్షింపదగినంతటి సమర్థుడను గాను. నేను కాలుఁడను. ఈతనియాయువు నేటితో సరియగుటంజేసి యీతని జీవముల గొనిపోవుటకై వచ్చితిని.

(సత్యవంతునిపైఁ బాశముఁ బ్రయోగించును.)

సావి—హా ! యమధర్మరాజా ! ఇంత నిర్దాక్షిణ్యము నీకుఁ దగదు. నీవు ధర్మమూర్తివి. న్యాయాన్యాయవిచారణ పారీణుడవు. నీవొక్కింత నాపైఁ గరుణబరపదలపవలయును.

చ॥ నిగనిగలాడువాఁడు ఘన • నీరజవైరినిబోలువాడు కెం
జిగిబిగిమోమువాడు కృప • చెన్నువహింపఁగజూచువాడు మేల్
సొగసులుగుల్కువాడు వరి • శుద్ధచరిత్రుఁడునైననా
మగనిని గావు మిప్పుడు స • మంచితభక్తిని నీకు మ్రొక్కెదన్.

యమ—తరుణీ! నీవు పుణ్యశీలవగుటంజేసి, మానవుల కగోచరమైన

నారూపము నీకుఁ గనబడినది. నీభర్తకు నాయువు నేటితో దీరినది ఆతఁడు పుణ్యమూర్తియగుటంజేసి కింకరులను బంపక జీవములను హరించుటకు నేనేవచ్చితిని. హరించితిని. విధికృత్యంబుల జరిగెడువానికి నీవు విచారింపవలదు. ఇంక నేఁబోయెద. (నడచుచున్నాఁడు.)

సావి— (వెంటనరుగుచు యమునిచూచి) సూర్యనందనా! కరుణాంతరంగుఁడవై నావిన్నపంబొక్కటి యాలకింపుము. సత్యవంతుని వివాహమాడి నేటికి పత్నినైతిని. ఆతని వదలిన నాకింత త్వరలోఁ బాపుట నీకు న్యాయముగాదు. సత్యసంధుడును, సుగుణశేఖరుండును నగు నీతఁడిట్టి యకాలమరణంబునకుఁ బాత్రుఁడుగాఁడు. అదియట్లుంచుము.

చ॥ తనయుఁడులేనికుటుంబము • ధరణిలో దైవంబు లేనట్టి యూరును, జంద్రుఁడులేని రేయి, రఘునీ • రుఁ మానసమందు గొల్వనిండిన్నఁబును, భర్తృహీనయగు నా • పద్మాక్షీయఁ జూచిన సజ్జనబృందంబులచేతఁ జూడఁబడునే • సత్యంబు దైవజ్ఞా తా!

అంపులోఁ బతిలేని సతిబ్రతుకేటికి? దుర్భరంబైన వైధవ్యము భరింపజాలను. నాకుఁబతిభిక్షపెట్టుము. నీకు నమస్కరించెదను.

యమ——సాధ్వీ! నీవునావెంట గడుదవ్వరుదెంచితివి. నీవిట్లు చింతింపుచు నన్ను బ్రతిమాలినందువలన బ్రయోజన మేమియును లేదు. నీపతిజీవంబు లింక యూటినా శరీరమున బ్రవేశపెట్టఁబడును.

మ॥ సరసీజేక్షణ నాదుమాట వినుమా • చంద్రార్క తారావనీ శరధిస్థాయిగ నెవ్వరయిన మనగా • శక్యంబె భూమండలిన్ మరణం బెప్పటికైన దేహికిస్థిరం • బైయుండు దానిన్ మదిన్ బరిశీలింపుచు ధైర్యముఁ గనుము భా • వంబందు నిప్పట్టునన్.

మృతుఁడైన నీభర్తను నీకు మరల సంప్రాప్తింపదు. మందివా రైనను జెడ్డవారైనను కాలమాసన్నమైనంతనే మృత్యుగహ్వా రంబున బ్రవేశింపక తీరదు. ఇంక మరలుము. (ఇంకను నడచును)

సావి—వైవస్వతా! ఏడడుగులు వెంటనడచిన నెట్టివారైనను బంధువు లగుదురని యార్యులు చెప్పుదురు. నేను నీతోఁ గడుదూర మరుదెంచితిని. అట్టిచో నేను నీకాప్తబంధువునని వేరే చెప్ప నేల? సమస్త ధర్మాధర్మవిచారణదక్షత నీయందు మూర్తీ భవించుటచేతనే నిన్ను ధర్మదేవతయందురు. ధర్మమూర్తివగు నీసందర్శనమున శుభములు పడయక నేనెట్లు మరలిపోదును?

మ॥ పతియే దైవమటంచు చిత్తమున సం • భావించి సేవించు నీ
సతికిన్ గష్టము దెచ్చి పెట్టుదువె? నా • సౌఖ్యంబులన్ ద్రుంతువే
పతినింబాసి శరీరమందు నిక నే • ప్రాణంబులన్ దాల్చి యే
గతి జీవింపఁగనోపు భూస్థలిని ఎ • క్కాలంబు సూర్యాత్మజా!
నీకు తెలియని ధర్మము లేమున్నవి?

యమ—(తనలో) ఆహా! ఏమి ఈ గంభీరభాషణములు! ఈమె వాక్యములు కఠినమనస్కుఁడనైన నాకుఁగూడ జాలిఁగొలుపు చున్నవి. (ప్రకాశముగా) మద్రరాజాత్మజా!

తే॥ గీ॥ భవ్యభవదీయ దివ్యసం • భాషణంబు
మెచ్చుకొల్పెను నాకిప్డు • మచ్చెకంటి
పతివియోగదుఃఖార్తవై • బరగు నీవు
వానియుసురు దక్క మఱొండు • వరము నిపుడు
గోరుకొమ్మిచ్చువాఁడను • గోర్కెతోడ.

సావి—(తనలో) ఈతఁడు మార్గములోనికి వచ్చుచున్నాఁడు. ఎట్లయిన నీతనిని విడువక వెన్నంటి నాపతిని రక్షించుకొనవలయును. (ప్రకాశముగా) దేవా! నీకు నాయందట్టి యనుగ్రహము గల దేని నరణ్యంబున నంధులైయున్న నాయత్తమామలకుఁ దృష్టి

ప్రసాదించి, దాయలచేఁ జిక్కిన వారిరాజ్యము మరల వారికిఁ గల్గున ట్లనుగ్రహింపుము.

**యము:**—అట్లేయగుఁగాక పోయిరమ్మా.

(నిష్క్రమించి వెంటనే ప్రవేశించును)

(సావిత్రియు నట్లేచేయును.)

**యము:**—ఇదేమి, మరల వచ్చుచుంటివి మరలను

**సావి**—ఎక్కడికి?

**యము**—మీయాశ్రమమునకు.

**సావి**—ఇట్టిది యెందైనఁగలదా ? పతి యెచ్చటనున్న సతియు నచ్చటనే యుండవలయును గదా? నీవు కృపాంతరంగుడవై నాకుఁ బతిదానం బొనరించితివేని మరలిపోయెదను. ఈధర్మసూత్రము నీనెఱింగినదే. ఈపతిని విడిచి నేనెట్లు బోఁగలను. నాయందుఁ గరుణవహించి పతిజీవంబుల నిమ్మా. లేనిచో నాప్రాణములఁగూడ నీపాశమున దీయుము. ఇరువురము నొకచోటనే యుందుము!

**యము:**—నారీమణీ! రావలదని యెంత చెప్పినను వినవుగదా!

ఉ॥ ఇచ్చ జనింప నాకుఁదర • శేషుణనీకు వరంబొసంగఁగా
నిచ్చితి; దాని దృప్తివహి • యించక నావెనువెంట నిట్టులన్
వచ్చెదవేల? వచ్చి పతి • ప్రాణము లీయుము లేకయున్న నే
జచ్చెదదాననంచుఁ గడు • సాహసలీలను బల్కెదేల! ఆ
చచ్చినవారితోడఁబడి • చత్తురె కాలము జెల్ల కెవ్వరేఁ •

ఇంక మాడమాటాడక యరుగుము. ఇటుపైననున్న మార్గమగమ్యము. ఇదియంతయు నెట్లున్నదో చూడుము.

సీ॥ కాలుబెట్టినయంత • కసుకు కసుక్కని
తోచుచునుండెడు • తుమ్మముండ్లు

ఎంతచెప్పినగాని • యెదురుచునే యుండి
బాటకడ్డమునిల్చు • బమ్మరెమును
ఏగుచో గాళ్ళకు • నెదురుదెబ్బలుదాకి
కడుబాధఁగలిగించు • కటికి రాళ్లు
స్వరమువిన్నంతనే • సరగున నడచుచు
నరుదెంచి పైఁబడు • వ్యాఘ్రచయము
తే॥ గీ॥ కలిగి నరుఁకు ప్రవేశింప • నలవిగాక
మిగులభీతిని గలిగించి • నెగడు నీయ
రణ్యమార్గ మిక నగోచ • రంబు; గాన
మాటలాడక వేగంబె • మరలుమీవు॥

ధాత వ్రాసిన వ్రాతను నెవ్వడును దప్పింపజాలఁడు. గతించిన దానికి వగపంబనిలేదు. వగచినను లాభములేదు. చచ్చిన వారితోడ వెంట నెవ్వరును రారు.

మ॥ తనువుం బోయినమీదటన్ మిగులఖే • దంబొందుచున్ గాటిదా
కనె యేతెంతురుగాదె చుట్టములు బ • క్కా లెవ్వరున్ జీవితో
వెనువెంటన్ జనుదేరజాలరుసుమీ • బింబోష్ఠి యీవాక్యమున్
మనమం దెంచుచు ధైర్యమున్ గనుచుఁ బో • మ్మావృవునీవింటికిన్॥

ఇదే నేఁబోవుచుంటిని.

(నిష్క్రమించి వెంటనే మరల బ్రవేశించును)

సావి—(వెంట నరిగి మరల బ్రవేశించును.)

యము—(తనలో) ఈ బాలసాహస మచ్చెరువగుచున్నది. నే నెట్టి దుర్గమమైనమార్గమునఁ బోవుచున్నను నావెన్నంటి వచ్చుచునే యున్నది. కానిమ్ము. ఇంకఁకభయపెట్టిచూచెదఁగాక! (సావిత్రినిఁజూచి) తరుణీ! నేనెంత చెప్పినను నావాక్యములఁ బాటింపక యుంటివి. గతించినవా రెప్పుడును మరల రారు. జీవకోటి యొక్క ప్రాణముల హరించుటయే నాముఖ్యోద్యోగము. నీవు

మరల నాశ్రమమున కరుగుటకు మిగుల కష్టపడుదువు. ఇంక జన్మంబునఁ నీపతిని జూడఁజాలవు. అతఁడు సజ్జనుఁడగుటం జేసి సుగతి కేగఁగలఁడు. ఇకముం దిదియంతయు యమలోకంబున కరుగుమార్గము. అగోచరంబును, భయంకరమునునై యుండును. అదుగో! అటుఁజూడుము. అయ్యది అసిపత్రివనము. ఇందలి యాకులన్నియు వాడిగల ఖడ్గములవలె నుండి తన్మధ్యము నుండి పోవువారి శరీరమునకు రాచుకొని రక్తము బ్రవహింపఁ జేయును. ఈమార్గముననే నాకింకరులు జీవులను దమపాశములచేఁగట్టి యీడ్చుకొనుచు ప్రేతసమూహముల కావాసమైన యామ్యనగరంబును, గాలదూషక పరిపాలితమగు సౌరియను పురమును, క్రూరము, క్రౌంచము, విచిత్రము, పక్వాపనము, సతప్తముననను ననేకపట్టణముల దాటించి నాసన్నిధికిఁదోడ్కొని వత్తురు. ఈపురములన్నియు మిగుల భయముగొల్పుచుండును. నీవు నాతో నరుదెంచుచు వృథాయాస మేల బొందెదవు?

(తెరలో కలకలము)

యము—సతీ! అటుజూడుము. నాకింకరులు జీవి నీమార్గమున నెట్లు గొనిపోవుచున్నారో!

(యమకింకరుఁడు, జీవుఁడు.)

జీవుఁడు—(తనలో) అయ్యో! ఈయమకింకరుఁడు పెట్టుబాధల సహింపఁజాలక యున్నాను. మార్గమందే యీతఁడిట్లు బాధించుచున్నాఁడు. ఇంక యముం డెట్లు జేయునో? బ్రతికియున్నప్పుడొక్క భూసురునకైన దాన మిచ్చియుండనైతినే. ఆశ్రయించినవారి కుద్యోగ మీయనైతినే. శాఖాభిమానమని యితరులకు హాని గూర్చితినే. కవులను బండితులను నాదరింపనైతినే. ఆలుబిడ్డలు నిత్యులని తలంచితినే.

కింక—వద వద. ఏడ్చిన నేమి లాభము? చేసినపాపము లనుభవింప వలయును. (కొట్టుచున్నాఁడు.)

జీవుఁడు—అయ్యో! నన్ను బాధింపకుము. నీదెబ్బలపోటులకు తాళ లేకున్నాను. రక్షింపుము.

కింక—రక్షించుటకు శిక్షించుటకును గర్త వేరొకఁడు. త్వరగా నడువు. పుణ్యభద్రియ వటవృక్షమును సమీపించుచున్నాము. అచ్చట విశ్రమింపవలయును. (జీవుని యీడ్చుకొని పోవుచు నిష్క్రమించును.)

యము—కాంతా! కంటివా కింకరుండు జీవుని నెట్లు గొనిపోవుచున్నాఁడో? ఇంక మాటాడక మేగుము.

సావి—దేవా! నీవు జీవులయందు సమబుద్ధి దాల్చియుండెడు కారణమున నిన్ను సమవర్తియనిరి. అట్టి నీవు నాయందుఁ గరుణ జూపకయుండుట మిగుల వింతగానున్నది. సావధానమతివై నా ప్రార్థన మాలకింపుము. ఏపాపమును జేసియెఱుంగని నామనోహరుని జీవంబుల నీవు హరించితివి. దీనివలన నీతనిజీవమే గాక యనేకప్రాణుల హరించినవాఁడ వగుదువు. నాపతిని నీవు రక్షింపకుంటివేని నీ చరణసన్నిధిని నేను ప్రాణముల వాయుదును. మాయిరువురిమరణంబు విని యంధులై యరణ్యమున దిక్కులేకయున్న మాయుత్తమానుబు మృతులగుదురు. ఇది యట్లుండుము. సంతానమునకై యనేక తపంబులొనర్చి నన్నుగాంచిన నాతల్లి దండ్రులకుకూడ నావిషయమైన చింతచే నట్టిగతియే సంభవించును. మహాత్మా! సమవర్తీ! ఈ దీనురాలియందు గరుణఁజూనుము. సమవర్తియగు నీవు ధర్మముతప్పరాదు. పతితోడనే లోకమని యెంచుచు, నెన్నఁడును నాతనిం బాసి యెఱుంగని నన్ను రక్షింపుము.

యము—(స్వగతము) ఆహా!

తే॥ గీ॥ అఖిలమర్త్యులజీవంబు • లపహరించి
కఠినచిత్తుండనగు నాదు • గరితవాక్య

ములు మిగుల జాలి, కరుణయుఁ • గొలుపుచుండి
చిత్తమంతయు నీరుగాఁ • జేసెనిపుడు॥

ఇంతదూర మరుదెంచిన యీయింతిని వృధగా మఱలిపొమ్మ నుట భావ్యముగాదు. [ప్రకాశముగా] సావిత్రీ! ఎవ్వరికిని నాదర్శనము దొరకలేదు. ఎవ్వరును నాతో నిట్లు భాషింపలేదు. నీవాక్యజాలము నాకు మిగుల నద్భుతముగొలిపినది. పతిజీవము లఁదప్ప మఱియొకవరము గోరుకొను మనుగ్రహించెదను.

సావి—(తనలో) ఈమహాత్మునకు నెమ్మదిగానాయందుఁ గరుణజనించుచున్నది! నావిభుని రక్షించువరకును నే నీతనిని విడువను. (ప్రకాశముగా) దేవా! సంయమినీపురాధీశ్వరా! నీయుపారకరుణకు సంతసించితిని. పుత్రసంతానములేక తపించు నాతల్లిదండ్రులకుఁ బుత్రోదయ మనుగ్రహింప వేడెదను.

యము—తరుణీ! నీతండ్రికి నూర్వురుకొమారు లుదయింతురుగాక! ఇంకబొమ్ము. ఆకనుపించునది వైతరణీ మహానది అయ్యది చీము నెత్తురులచే నిండి మహాభయంబును గొలుపుచున్నను. దాని నెవ్వరును దాటఁజాలరు. పుణ్యము జేసికొనిన వారిని మాత్ర మొక్కగో వచ్చేడ కరుదెంచి తన తోకమూలమున దాటించును. ఇప్పుడు నేను దాని నాకాశమార్గమున దాటి నాపురంబున కరిగెద. ఇంక నీవు తడవుసేయక పొమ్ము.

(నిష్క్రమించును)

సావి—అయ్యో! నా కా వరంబు ననుగ్రహించి యము డరుగుచున్నాఁడు. నానాధునివిషయమై యీత డించుకయు గరుణించుటలేదు. అక్కటా! నే నేమి సేయుదును? ఈవైతరణీనది నెట్లుతరించి పోవుదును? (ఆలోచించి) ఏమైనఁగాని ధైర్యము బూని పితృపతివెంట నరిగెదగాక! (నదిని నమీపించి)

ఉ॥ నారమణుండు సద్గుణగ • ణస్తవనీయచరిత్రుఁడేని, నే
నే రమణీశిరోమణిన • యేని, మనోహరు పాదసేవనిం

పారఁగఁ జేయుదేని జగ • దంబను గొల్చెదనేనిఁ గాలునిం
జేరఁ దరింతుగాక కడు • భీషణమౌ వైతరణీమహానదిన్॥

(దాటుచు నిష్క్రమించును.)

---

రంగము:—యమపురి ప్రవేశము: యముఁడు

యముడు—(తనలో) ఆహా! ఈసావిత్రిచర్య నాకు మిగుల వింతఁగొలుపుచున్నది. మానవుల కసాధ్యమగు నసిపత్రవనంబును, వైతరణియును నాతోఁబాటతిచులకనగా దాఁటి తుదకు నాపురమునకుఁగూడ వచ్చినది. కానిమ్ము. ఈమె లోనికిఁ బ్రవేశింపకుండ నగరద్వారమును మూయించి, జీవవిచారణోద్యోగమున నుండెదగాక! (ప్రక్కంజూచి) ఓరీ! కింకరులారా! ఆవచ్చు కాంత లోపల ప్రవేశింపకుండ ద్వారముల మూసివేయుఁడు.

(నిష్క్రమించును)

సావి—(ప్రవేశించి తనలో) భర్తృసేవాపరతంత్రనగు నేను దుర్గాకటాక్షమున వైతరణీనదిఁగూడ దరించి తుదకు నిక్కడకుఁగూడ వచ్చితిని. అదిగో! నారాకజూచి కింకరులు పురద్వారమును మూసివేసిరి. ఇది కాలుని యాజ్ఞయై యుండునోపు. కానిమ్ము. ఏమైననేమి? అధైర్యమునకుఁ జిత్తమున స్థల మీయరాదు. దీననగు నన్నుద్ధరించుటకు జగదీశ్వరియే దిక్కు. పతిని సజీవుని జేయు వరకును పితృపతిని విడువరాదు. ఎట్లో మార్గముఁ జేసికొని యముని కొలువుకూటమున కరుగవలయును. (ఎదుటఁజూచి) ఈనగరద్వారము లాకాశమునంటి యున్నవే. నేనే రీతిని బురప్రవేశ మొనర్చి యముని దర్శింపగలను. అయినను యత్నించెదగాక. (నగరద్వారమును సమీపించి) హే! కాత్యాయనీ!

ఉ॥ ఏను మహాపతివ్రతన • యేని, సుధర్మము నెంతు నేని; నా
మానసమందుఁ బ్రాణధవు • మానక గొల్చెడి దాన నేని; స

న్నొకల నెల్లవేళల న • మంచితభక్తిని చూతు నేని; యం
బా! నను బోల్పు మిప్పుడు క • వాటముబ్రిద్దలు సేయుచున్ వెనన్॥

[పెద్దధ్వనివినవచ్చును;కవాటముబ్రిద్దలగును;సావిత్రినిష్క్రమించును]

(అంత దెరలేచును యముని సభాస్థానము.)

(యముఁడు, చిత్రగుప్తుఁడు, కింకరులు ప్రవేశము.)

సావి—(ప్రవేశించి యమునిఁ జూచి)

తే॥ గీ॥ ధర్మమే నీకు నియ్యది • ధర్మమూర్తి!
యింతదూరంబు వచ్చిన • నింతి చూచి
జీవితేశుప్రాణంబు ర • క్షింపకుండ
స్వస్థచిత్తుడవై యుంటి • సచ్చరిత్ర॥

యము— (సావిత్రిని చూచి తనలో) ఏమిా! పరమాద్భుతమైన యీామె మహిమ! తుదకు నాపురంబునకుఁ గూడవచ్చినది. ఇంతకు ము న్నెదియో యొక పెద్దధ్వని వినవచ్చినది. అది యీామె మహిమ వలన నగరద్వారము బగులుటయని తలంచెదను. ఈమె సాహసమెంతయుశ్లాఘ్యము. ఇప్పుడు నే నీమెదెసఁ జూడకుండ జీవనవిచారణ మొనర్చెదగాక! అదియంతయుఁ జూచి భయంబందియైన మరలి పోకుండునా? (చిత్రగుప్తునిచూచి) చిత్రగుప్తా! నిన్నవచ్చిన జీవులను విచారింపవలయు నుగదా?

చిత్ర—చిత్తము, (కింకరునిఁచూచి) కింకరా ఆజీవునిట్లు దోడ్కొని రమ్ము.

కింక—చిత్తము! (నిష్క్రమించి వెంటనేజీవులతోఁబ్రవేశించును.)

చిత్ర—(ఒక్కొక్కజీవునిఁజూపుచు) దేవా! చిత్తగింపుము.

సీ॥ పాపంబు నెంచక • పరభామలనుబట్టి
బలిమిమైఁగ్రీడించు • పాపియితడు

పతిసేవనొల్లక • స్వైరిణీ వృత్తిని
బూనిచరించెడు • పొలతియామె
బ్రాహ్మణధనముల • నపహరించి సౌధముల్
నిర్మించిమించు • మనిన్నఁడితండు
కూటసాక్ష్యములిచ్చి • కొంపలదిగమ్రింగి
ద్రవ్యమార్జించు దు • ర్మార్గుడితఁడు
తే॥ గీ॥ జారునింగూడి యుండంగ • సంతసమున
భర్తకు విషంబునిచ్చిన • పడతి యామె
ధనము నాశించి కన్యకా • దానఫలము
మరచి, తనకూతునమ్మిన • మనుజుడితఁడు॥
వీరందరకును నెట్టి శిక్షల విధింతువో విధింపుము.

యము—కింకరులారా! మొదట జెప్పబడినయా స్త్రీ పురుషులను తామ్రముతోఁ జేయబడియగ్నియందుఁ గాల్చబడియుండు ప్రతిమలను గౌగలించు కొనునట్లుఁజేయుడు. బ్రాహ్మణధనంబులపహరించిన యాజీవుని గానుగయందుఁ బెట్టి త్రిప్పుడు కూటసాక్ష్యము లిచ్చిన వారిని రోకండ్లచే మొత్తుడు. భర్తకు విషంబిడిన యాపాపాత్మురాలిని సలసల గాగుచున్న చమురునందు వేయుడు. కన్యావిక్రయుని నిచ్చ వచ్చిన తెరంగున చేయుఁడు పొండు.

(జీవులు రోదనము సేయుచు గింకరులతో
నిష్క్రమింతురు)

సావి—(తనలో) ఏమిభయంకరముగా నున్నది! (యమునిఁజూచి, ప్రకాశముగా) దేవా! వైవస్వతా! భయము గొలుపుచున్న యాజీవులశోకారవములు వినఁజాలను. కరుణ వహించి నా పతిప్రాణముల నిచ్చి నన్ను బంపుము.

యము—అబలా! బేలవై య్యాలీల గోల చేసెద వేల? ఇంత దూ

మేల క్రిమపడి వచ్చితివి? పుణ్యవతి వగుటం జేసియే రెండు వరంబు లిచ్చియుంటిని తృప్తిపొంది మరలుము. ఈనరకబా ధలను నీవు చూడఁజాలవు. అటు చూడుము.

తే॥ గీ॥ అదియె యంధతామిశ్రంబు • నదియె రౌర

వంబు; నదియె మహారౌర • వంబు;

ఈవైపునకు వచ్చి చూడుము. నిదియె

ప్రాణరోధ; తప్తోర్మియు • వైతరణియు

నదియె సారమేయానందంబు; • బదిగో! చూడు

వజ్రకంటక శాల్మలి; • భాను యువ్రుడు.

ఇట్టి భయంకర లోకంబున నీవు నిలువ జాలవు. సత్వరముగఁ బొమ్మా. ఇంక ననేకజీవుల నీనరకంబులందు బెట్టి కింకరులు బాధింతురు. ఆశోకారావంబులఁజూచి నీవు భయంబంది యే మైన నపాయము బొందగలవు.

సావి—మహాత్మా! వీని నన్నిటిని చూచి నాకు భయము గొల్పకుము. భర్తలేక తక్కిన దేదియున్నను బ్రయోజనము లేదు. సమస్త సౌఖ్యములకును నాలవాలమైన పతిసేవను విడచి భూతలమున నేనెటులఁ జీవింపఁగలను.? పతిలేని సతి బ్రతుకు వ్యర్థముగదా! ఆ రరక్షణము నీయం దమరి యున్నది. కాని యేకారణముచేత నాయం దింతవఱకును గృపవహింపక యుంటి వో యూహింపజాలకయున్నాను. కరుణించి మానవస్త్రీనైన నేనింతదూరము పతి నెడబాయ జాలక వచ్చితిని గదా యని తలంచి యైనను నాకుఁ బతిభిక్షఁ బెట్టుము.

యము:—(తనలో) ఈసమయమున నాచిత్తమున గరుణం బ్రవేశ పెట్టరాదు. ఆగ్రహము నటించినగాని బ్రయోజనము లేదు. అసి పత్రవనమార్గమున రావలసివచ్చినను, వైతరణి దాటవలసిన వ్వుడైనను, దుదకీ లోకబాధలు గన్నులారఁ జూచుచుండినను,

నినుమంతయైన స్వాంతమున భయమందని యీ యువతి నా కోపమునకు మాత్రము భీతిల్లునా? కానిమ్ము. అప్పటికిని మరలిపోవకయున్నచో మఱియొకమార్గమును జూచెదఁగాక! (ప్రకాశముఁగా కోపముతో) నారీమణీ! నేనెంత చెప్పినను నీవు వినకుంటివి. నాకడసారివాక్యముల వినుము. నాపురమునకు వచ్చుటయే కాదు. నీవు చతుర్దశభువనంబులయందు జరించినను నీపతిని నీవు మరలఁ బడయఁజాలవు. ఇది ముమ్మాటికి నిశ్చయము. ఇంక నీతో సంభాషించుటకు నాకు వీలులేదు. పొమ్ము.

సావి—పితృపతీ! నాభర్తను నేనింక మరలఁ బడయఁజాలనా? ఎంత నిర్దాక్షిణ్యచిత్తుఁడవు! విరించి నీహృదయమును కఠినపాషాణతుల్యముగఁ జేసెనా? సాధ్వీయుని యు, బతిప్రాణ రక్షణార్థమై యింతదూరము వచ్చెనని తలంచియైన నీవు కృపఁజూపకుంటివి కదా! చతుర్దశభువనముల కరిగినను నాపతిని గాంచలేనా? నాపతి మరలరాడా? నాకుఁ బతియె లేడా? వైవస్వతా! సమస్తాభీష్టప్రదంబును, సకలపాపశోషణంబును, సౌఖ్యశ్రీల కాలవాలంబును, సత్కీర్తిదాయకమును, నవరత్న మణిమయహారంబును, ముక్తిమార్గమును నగు బతిసేవయే నాకు లేకుండునా? నాకుఁ బతియే లేకుండనుండి, సాధ్వినగు నేనట్టిదుఃఖమును బొందితినేని, యీలోకము లుండునా? సూర్యచంద్రాదులుందురా? నీలోకముండునా? నీపరిపాలన ముండునా? నీవుందువా? సకలలోకములును నంధకారమయమై యొప్పవా? ఒక్కపెట్టున జగత్త్రయము సంభవింపదా? (ఇంచుకయూరకుండి) కృతాంతా! కరుణారసార్ద్రహృదయుఁడవైతివేని నన్ను రక్షింపుము.

యముఁడు—(తనలో) ఆహా! ఈమగువయొక్క తెగువ నేమనవచ్చును! నేననేక సాధ్వీమణులను జూచితినిగాని యిట్టికాంతను నెందును వీక్షించియుండలేదు. ఈమెమహిమ పరమాద్భుతము!

ఈమె చరిత్ర మనింద్యము. ఈమె గంభీరవాక్యములు నాకు మిగుల భయము గలిగించి దేహము గంపింపఁ జేయుచున్నవి. ఆహా! పతిభక్తికి మించినదేదియును లేదుకదా! పతివ్రతాతిలకమగు నీమె నన్ను శపింపఁదలఁచినచో శపింపఁగలదు. భర్తృసేవాసక్తచిత్తయగు నీమెకు దుర్ఘటమైన కార్యమేమియున్నది? యీమెపతిభక్తి నెంతయు గొనియాడ వలసియున్నది. అతివలకుఁ బతిభక్తియేకదా భూషణము. అదియేకదా మోక్షసంధాయకర్త. అదియేకదా సర్వసౌఖ్యప్రదాయిని. అదియేకదా సమస్త పాప వినాశని. అదియేకదా సంతోష దాయకము. వేయేల నారీమణులకుఁ బతిభక్తికిమించిన దేదియును లేదు. ఇంక నే నీమె విషయమై కాఠిన్యము వహింపరాదు.

(సావిత్రిఁ జూచి ప్రకాశముగా)

ఉ॥ అచ్చెరువయ్యె మద్రితన • యా! యిపుడాడిన మాటలెల్ల; నీ
సచ్చరితంబు నాకుఁగడు • సంతసమిచ్చెను; నంశయుంప కే
నిచ్చితిభర్తజీవము ల • హీనకృపా మతినై; ముదంబుతోఁ
జెచ్చెర నేగుమీ యిఁకను • జీవవిభుం కట వేచియుండెదుర్‌

మ॥ వసుధేశుఁడు నీదు ప్రాణవిభుఁడా • చంద్రార్క తారావనీ
శరధిస్థాయిగ రాజ్యమేలుచు నమ • స్తైశ్వర్యముల్ గాంచుచున్
జిరకీర్తిన్ గొనుచున్ మనంగలఁడు వా • నిన్ సంతతిన్ గాంచి భూ
వరసంఘంబున కెల్ల మేటియగుచున్ • బల్మాట్ల లింకేటికిన్

సావి—పితృపతీ! ఇప్పుడుగదా నేను ధన్యనైతిని. నీకరుణ నాపైఁ బఱపుటచేఁ గదా మరల నానాథుని గన నోఁచితిని. కాకున్నచో నిట్టిభాగ్యము నెవ్వరైనఁ బొందియుండిరా?

యమ—ఇందు నేఁజేసిన దేదియునులేదు. నిన్ను నీపతివ్రతాత్వమే కాపాడినది.

సీ॥ రాళ్ళువేయుంచి వారిఁ దునకుఁ బెట్టిన
యా యరుంధతిమించి యలరినావు
బలుగఁ ద్రిమూర్తులఁ బసిబాలురుగఁ జేసి
మించిన యనసూయ మించినావు
పరమపతివ్రతలైన కాంతలకు నెల్లఁ
దలకట్టువోమను దనరినావు
భవదీయగుణములు పడతులు వీక్షించి
నేర్చుకొనుకరణి నెగడినావు
తే॥ గీ॥ మించి యిపుడు ప్రాణేశు రక్షించినావు
భవ్యభవదీయసత్కీర్తి వల్లి భువిని
నలుదెసలయందుఁ బ్రాకయా వలన విబుధ
లోకమానసంబునుగాకఁ బ్రాకటముగ॥

నీవు దీర్ఘసుమంగలివై యుండుదువుగాక! నీవు నయనములు మూసికొని యుండుము. త్రుటిలో నీపతిసన్నిధి కరుగఁగలవు.

సావి.—మహాత్మా! ధర్మస్వరూపుండవగు నీవొనర్చిన యీ యుపకారమునకు భవదీయపాదపంకేరుహములకు నమస్కరింపుచు నీయానతిం జేసి నిమీలితలోచన నగుచుంటిని.

(కన్నులు మూసికొనును.)

యము—(తనలో) ఈమెను సత్యవంతునికడకు జేర్పవలయును.

(తెర వాలును.)

ఇది తృతీయాంకము.





# సావిత్రి నాటకము.

## చతుర్థాంకము.

రంగము—అరణ్యము

(మృతుండైన సత్యవంతుఁడు లేచియుండును)

సత్య—ఆహా! నా కెంత దీర్ఘనిద్ర పట్టినది. తలనొప్పిబాధ భరింపఁజాలక నా సతీమణియంకతలంబున శిరంబు చేర్చి యట్లే నిద్రించితిని. ఆ నిద్రయందు నన్నెవ్వరో యొక్కడికో యీడ్చుకొనిపోయినట్లుండెను. అమ్మయ్య! ఇప్పటికిఁ బ్రాణములకు స్వస్థతఁజిక్కినది. (ప్రకాశముగా) సావిత్రీ! సావిత్రీ! (లేచి) తనయంకతలమున నన్నునిద్రింపఁజేసిన నా బహిఃప్రాణమేదీ? ఎచ్చటికేఁగియుండెనో! ఆమె నన్నిట్లు విడిచి యాశ్రమంబున కరుగునా? అట్లెన్నటికిని జేయదు. సూర్యాస్తమయమునకుఁ బూర్వము నేను నిద్రించితిని. ఇప్పుడు మేల్కొంటిని. ఇప్పు డర్ధరాత్రిసమయ మైనది. ఆశ్రమమునకు మేమింతవరకును రాకయుంటిమని యంధులగు తల్లిదండ్రులెట్లు వంతపడుచున్నారో! అక్కటా! ఇప్పుడు నా సతి యొందరిగెనో! ఈ అర్ధరాత్రి సమయమున నేమయ్యెనో! ఏపులివాతనైనఁ బడినదా? [ఆలోచించి] నిశ్చయముగా నట్లేయైయుండును. అయ్యో! తన్వీమణీ! నీవులేకున్న నాకీజగం బేల! ఈతనువేల! హా! పరమేశ్వరా! మమ్మిట్లు పరీక్షించుట కెట్టి యిక్కట్లు సంప్రాప్తింపఁ జేయుచుంటివి! [సావిత్రిని ఉద్దేశించి] హా! సతీ!

తే॥ గీ॥ పరిణయమునకు ముందె నీ ◆ ప్రాణ మీను
గోరియుంటిని బలిఁ జంపి ◆ పొలఁతిమిన్న!
యిపుడు నట్టిది యొనఁగూడ ◆ నేమిసేతు
జాలి నైతిగదా యుంచు ◆ జాలవగతు॥

(ఇంచుక యూరకుండి ఆలోచించి) ఏమోగాని నాసతి కెట్టి యుపాయమును మూడియుండునని తలంపను.

(సావిత్రి ప్రవేశము)

ఆహా యముని దయచేఁ ద్రుటిలో నిచ్చటకుఁ జేరితిని.

సావి—(సత్యవంతుని జూచి) అహో! నాప్రాణనాథుఁడు లేచి నాకో అక్కఁగాబోలు నిటు నటుఁ జూచుచున్నాడు. ఆహా! ఇప్పుడు నాకుఁ గలుగుచున్న సంతోషమునకు మేరలేకున్నది.

తే॥ గీ॥ మరణమందినవారలు ◆ మరల బ్రతుక
గనుట గంటినే యెటనైన ◆ ధాత్రితలమున
మరణమందిన నాభర్త ◆ మరల బ్రతుక
గంటి నేడు కృతాంతుని ◆ కరుణవలన॥

కారణమునం జేసి నే నెంతయుఁ గృతార్థురాలను. (సత్యవంతుని సమీపించి) నాథా! కుశలముగనుంటివా?

సత్య—హా! సావిత్రి! వచ్చితివా! ఇంతవరకు నీవేమైతివో యని నీకై సంతాపమందుచున్న నాకు నీవు నయనపర్వ మొనర్చితివి. ఈ యర్ధరాత్రమున నీ వెచ్చటికి బోయియుంటివి? నీయంకతలమున శిరము జేర్చి శయనించిన తరువాత నేమి జరిగినదో యెరుగను.

సావి—నాథా! నీకును నాకును నీ లోకమున బుణము దీరినదనియు నిఁక బరలోకమునందె మన మిరువురము సౌఖ్యమందుదుమని యుఁదలంచితినిగాని యట్లు జరుగలేదు. భగవంతుఁడు నాపాలిట నుండుటచే మాకు సౌఖ్యము గలిగినది.

సత్య—(తనలో) నా నిద్రాసమయమున నేదియో జరిగియుండును. (ప్రకాశముగా) సతీ! అదేమి?

సావి—అదియంతయు సావధానముగ నాశ్రమమునఁ దెలిపెదను. మీతల్లిదండ్రులు మన యాలస్యమునకు మిగుల వగల బొగ లుచుందురు. సత్వరముగఁ బోవలెను, రమ్ము.

సత్య—మన యాశ్రమునకుఁ బోవునప్పటికి దెల్లవారును. రమ్ము. (నిష్క్రమింతురు)

---

రంగము—(ఆశ్రమమున ద్యుమత్సేనుఁడు. భద్రాంగి-ప్రవేశము)

ద్యుమ—(భద్రాంగినిజూచి) సతీమణీ! భగవంతుఁడు మన యిరువు రకును దృష్టిఁ బ్రసాదించి కొడుకును కోడలను జూడకుండఁ జేసినాఁడేమి! అక్కటా! నిన్న మధ్యాహ్నసమయమున నర ణ్యమున కరిగిన సావిత్రీసత్యవంతు లింతవరకును నాశ్రమంబు ను జేరరైరి. (భగవంతుని నుద్దేశించి) హా! పరమేశ్వరా! దృష్టి బ్రసాదించి యీదీనుల గడగండ్లపాలు సేయనెంచితివా!

భద్రా—అయ్యో! ఎన్నడును నట్లాశ్రమము విడిచియుండని వారే మైరో గదా. అక్కటా! మనకింక నేమిగతి?

(నారదుఁడు బ్రవేశించును)

నార—(స్వగతము) ఆహా! సావిత్రీ ప్రభావమెంతయు మెచ్చవచ్చును. కృతాంతునిగూడ గెలిచి పతిని రక్షించుకొనె నదిగదా! (ఎదుట జూచి) ఇదిగో! యముని వరప్రభావమువలన దృష్టిగలిగి సావి త్రిసత్యవంతు లింకను నాశ్రమంబును జేరలేదనియీవృద్ధదంప తులు విచారింపుచున్నారు. (సమీపించును)

ద్యుమ—నారదమునీంద్రా! నమస్కరించుచున్నాను. ఈదీర్ఘాననముపై నాసీనులగుఁడు.

నార—(ఆసీనుఁడగును)

ద్యుమ—మహాత్మా! తమరాక మాకుశుభప్రదమని తలంచుచున్నాను.

తే. గీ. కొడుకు సావిత్రితో నిన్న • నడవికేఁగి
యింతవరకును రాకుండె • నేమి కతమొ
ఘోరకాననమందు నే • క్రూరజంతు
వైన హాని గల్గించెనా • యనుచు వగతు

నార—రాజా! నీవు వారింగూర్చి విచారింప నక్కరలేదు. వినుము! నిన్నటితో నీ తనయునకు బ్రహ్మయిచ్చిన యాయుర్దాయము తీఱినది.

భద్రా ద్యుమ—హా! కుమారా!

నార—నృపాలా! చెప్పుచుండఁగనే యింత తొందరయేల? ఇటువినుము ఈ సంగతి పుణ్యవతియగు సావిత్రికి దెలిపియుండుట చేతనే యామె యతని వెంట నరిగినది.

భద్రా—మునీంద్రా! ఇంకను వినవలసినదేమున్నది! కడుపు దహించుకొని పోవుచున్నది.

నార—చెప్పదలంచినదంతయు జెప్పనిండు. అట్లాత డరణ్యమున కేఁగి కట్టెలను గొట్టుచుండగాఁ దలనొప్పి బాధ నంభవింప దానిని భరియింపఁజాలక సావిత్రియంకతలమున శిరము జేర్చుకొని నిద్రను మునింగెను.

ద్యుమ—అయ్యో! ఆనిద్రయే దీర్ఘనిద్రయయ్యెనా! మునీంద్రా! హా! భగవంతా! దృష్టిప్రసాదించి కొడుకునిటుజేసి, నీవు నవ్వుచుం

టివా? (నారదునిఁజూచి) తాపసోత్తమా! తరువాత నెట్లు జరిగినది?

నార—అప్పుడు కృతాంతుఁడరుదెంచి తన పాశములచే సత్యవంతుని శరీరమున జీవుని వెడలదిగిచి బంధించి తన నగరాభిముఖుఁడయ్యెను.

భద్రా—హా! కుమారా! మాకింక దిక్కెవ్వరు? సావిత్రినేమిచేసితివి?

ద్యుమ—సావిత్రియు నతనిమార్గమునే యనుసరించియుండును. (నారదునిఁజూచి) మునీంద్రా! ఇంక చెప్పనక్కరలేదు. మేము వారిని గలసికొననట్లాజ్ఞనీయుఁడు.

నార—దంపతులారా! ఈయారాట మేటికి? సత్యవంతుని జీవములఁగొనిపోవుచున్న యమునివెంట సావిత్రి యమలోకమువఱకును నరిగి తన సుగుణములచే నాతనిని మెప్పించి ప్రథమవరమున మీకు దృష్టి గలుగునట్లును, రెండవవరంబున నశ్వపతి పుత్రవంతుఁ డగునట్లును, వరంబు గ్రహించి తుదకు భర్తను గూడ బునర్జీవితుఁ డగునట్లు జేసికొనెను. వారిప్పుడే యిచ్చోట కరుదెంతురు.

ద్యుమ—తాపసోత్తమా! సంతోషము బట్టజాలకయున్నాను.

భద్రా—మునీంద్రా! సంతోషవార్త దెలిపిన మీకు నమస్కరించుచున్నాను.

నార—(ఎదుటఁజూచి) అదిగో! సావిత్రీసత్యవంతులు వచ్చుచున్నారు.

(సత్యవంతుడు, సావిత్రి ప్రవేశము.)

సత్య—తరుణీ! నీమహిమాతిశయమునఁగదా నేను జీవించితిని. అదిగో! నారద మునీంద్రుడుగూడ వచ్చియున్నాడు. (సమీపించి) తండ్రీ! నమస్కారములు.

సావి—అత్తమామలారా! వందనములు.

ద్యు మ—(సత్యవంతునిఁజూచి) వత్సా! వచ్చితివా! నాయనా! మన మందఱము సావిత్రిచే రక్షింపఁబడితిమి. (సావిత్రినిఁజూచి) తల్లీ! సావిత్రీ! నీకారణంబున నుభయకులములు బవిత్రములై నవి. అసమానాద్భుతమహిమగలిగిన నీవు మాకుఁ గోడల వైతివని గర్వించుచున్నాను. నీవు నాథునివిషయమైయొనర్చిన మహిమయంతయు నారదునివలన నిప్పుడే వింటిని. మాకుఁ బుత్రభిక్షయు, దృష్టియు నీవలన గలిగినవి. నిన్నుఁగొనియాడ నెవ్వరితరము!

నార—తల్లీ! సావిత్రీ!

సీ॥ దారిద్ర్యమునుబొంది • తద్దయు నిడుమల
బొందుచుంటిరని వీ • క్షించియుండి
వైవాహికంబైన • వత్సరంబునకె ప
తికి మృతియుండుట • దెలిసియుండి
వలదంచు పలుమారు • పలికిన తల్లిదం
డ్రులమాట నొక్కింత • తలపకుండ
సత్యవంతునిఁదప్ప • సమ్మతింప మరొండు
వరునియంచు వచించి • వానిఁగాంచి

తే॥ గీ॥ యంతకుని మెప్పుగైకొని • యతనిగాచి
యుత్తమామల యంధత • నవనిబాపి
దల్లిదండ్రులవిషయమై • తగినవరము
గాంచి యుభయకులముల ర • క్షించితీవు,

లోకముననున్న జవరాండ్రు నిన్నుజూచి పతివ్రతాత్వమును నేర్చుకొందురుగాక! నీవు దీర్ఘసుమంగలివై యుందువుగాక!

సత్య—(ప్రక్కంజూచి) ఎవరో వచ్చుచున్నట్లున్నారు.

(పౌరులు కొందఱు ప్రవేశింతురు)

పౌరు—(తక్కినవారితో) ఇదుగో! మన ద్యుమత్సేనమహారాజుగారు! (ద్యుమత్సేనునిజూచి) మహారాజా! దండములు. మిమ్ములను రాజ్యభ్రష్టులుగా జేసిన చిత్రకేతుని పరిపాలనము క్రూరముగా నుండుటచే బ్రజలందరేకమై యాతనిని బంధించి వధించిరి. ఇప్పుడు రాజ్యము రాజకమై యున్నది. దేవరవారు విచ్చేయవలయును.

సత్య—మీారు పొండు. మేము రేపుదయమున నే బయలుదేరి వచ్చెదము. మా రాక మంత్రుల కెఱిఁగింపుడు.

నార—(ద్యుమత్సేనునిఁజూచి) రాజేంద్రా! వలసినవన్నియు సమకూడెను. ఇంక మీాకు గొఱంత యేమియు లేదు. నీవిక బురమునకరిగి సత్యవంతుని రాజ్యాభిషిక్తునిగఁ జేసి భగవదారాధనయందు గాలము గడుపుము. అభిషేకోత్సవమునకు నేనుగూడ వచ్చెదను.

ద్యుమ—మహాప్రసాదము! (అందఱు నిష్క్రమింతురు)

రంగము:—సాళ్వపురమున సభామందిరము సింహాసనముపై సత్యవంతుఁడు సావిత్రి; ద్యుమత్సేనుఁడు నారదుఁడు మంత్రులు మొదలగువారు ప్రవేశము)

ద్యుమ—కిరీటమును సత్యవంతుని శిరముపై బెట్టి వత్సా! వంశక్రమానుగతమగు నీసాళ్వరాజ్యము ధర్మసంధుఁడవై చిరకాలము పరిపాలింపుము.

నార—

మ॥ ఇలయెందాక సుధాంశుఁ డంబుజహితుం • డెందాక బృందారకావలి యెందాక వెలుంగు నంతదనుకన్ • బాలింపు మీాభూమి, స
జ్జ్వలమాణిక్యకిరీటకుండల విరా - జన్నీల సంఘాత కుంతల విభ్రాజితపూర్ణచంద్ర విభవ • క్త్రా! సత్యవంతాహ్వయా!

ద్యుమత్సేనా! పరమేశ్వరుని కృపవలన మీకష్టములన్నియు దొలంగినవి. మీరాజ్యము మీకు లభించినది. సత్యవంతుని రాజుగా నొనర్చితివి. ఇంక గావలసిన దేమున్నది?

ద్యుమ—

తే॥ గీ॥ ధరణి సావిత్రినామంబు • స్మరణ సేయు
నువిదలెల్ల పాపంబు బా • యుదురుగాక!
నెలతసత్కీర్తి దిశలందు • నిండుగాక!
ధర్మమే జయంబనుమాట • తనరుగాత!

నార—తథాస్తు!

(తెరవాలును)

ఇది చతుర్థాంకము

సర్వము సంపూర్ణము



చిత్రకేతుడు కమాన—ఆదితాళము.

పోపోరా - క్రూరా - యినాడే॥
పురమువిడిచి - వనులకేగ - వరసుతుడు, సతియు వెంటరా॥పో॥
మదముపోయెనే - నాబలము తెలిసెనే, నీ
మదికిశాంత మొదవెనే - యివుడు ॥పో॥

ద్యుమత్సేనుడు - బిళహరి—ఏకతాళము.

ధాతావ్రాత - దాటతరమే॥
భూతలపతినై - పాలచిననేను
ఖ్యాతినివిడిచి - కానలకేగనయ్యెగా॥ ధా॥
చిరుతప్రాయమువాడు - చిన్నకొమరుడూ
అరణ్యభూములందు - హా యెటులుండు॥ ధా॥

సావిత్రి - బేహాగ్——ఏకతాళము.

ఆహా! యీకాననంబు యెంతో - అందమై చెలువొందెగా
మహానందమయ్యెగా నా - మానసంబునకు॥ ఆ॥
సాకీ॥ అఖలపుష్పతరులతాశోభితంబు
విమల సలిలాసారకాసారయుతంబు
మిత్రము॥ కాంచగాంచమిగుల కనులపండువాయెగా
చూడజూడ వింత యెంతో దోచెగా॥ ఆ॥

సత్యవంతుడు - తోడి—అటతాళము.

ఎంతానివర్ణింతు - నింతిచక్కదనము - నింతిచక్కదనము
కంతుచేతికతారి-వహ్వరె యీనారి - యీనారీమణిసోయగ॥
యెంత॥
తాపసులకైన మదన - తాపముగల్గించి, సం
తాపమందగజేయు నీ - పద్మాక్షి॥ యెంత॥

సత్యవంతుఁడు-కల్యాణి— ఏకతాళము

మదవతిగనగను మదనుం డదయుండై
వదును శరముల బఱపెడి - నాహృదయమున
ఈబాల - ఈగుణశీల - యీాబేల యేభూ
పాలు గృహమును - పావనము సేయ నున్నదో॥ మ॥

సత్యవంతుఁడు - కన్నడ—ఆదితాళము.

మానిని నీవెవ్వతవే యను - మానము మాని వచింపగదే
కానసభూమికి నొంటరిగా - జనుదెంచితివే॥ మా॥
తల్లిదండ్రుల నామం బొప్పగ - దగ వినిపింపగదే
యుల్లమురంజిల్లెను నిను - జూడగను॥ మా॥

సావిత్రి - పూరికల్యాణి—ఏకతాళము.

నృపనందనా నీ యుపకారము - మరువ జాలను
నిర్హేతుక కరుణబూని - నిజముగ బులివాతను
బడగ నుండిన - పడతిని - నన్ గాపాడితి వీవు॥ నృ॥
ఏమియొసర్చిన - దీఱదు - ఋణము గావున
నీమము తోడను - బ్రణుతి గావించెద॥ నృ॥

సత్యవంతుఁడు - నాదనామక్రియ—ఆదిఏకతాళము.

అవివాహితనని - యతివబలుకుట నాసకలిగె నాకిక
నాకోరిక తెలిపిన - నాతి యేమని తలచునో!
తెలుపక యుండిన మదనుని గెలుచుట యెటులో॥ అ॥

గాలవుడు - వసంత—ఏకతాళము.

మరునిగెల్చినవాడే - మహిని ధన్యుఁడగు సుమా
కానసమందున - గఠినతపము సేయగ నేల
తీర్థముల కేగగనేల - నిష్ఠలు జరుపగ నేల
గంగాదినదుల స్నాన - జపములేల॥ మ॥

సత్యవంతుఁడు - సారంగ—రూపకతాళము.

పోవుచుంటివా - పూర్ణేందువదనా
నీచెలి నీకును - నాసఖుడు నాకును
యింతలోన - నెడ - బాటు గావించిరి॥ పో॥
మరల నిను జూచు - భాగ్యము - తరుణీమణి - గలుగునో
గలుగదో॥ పో॥

సత్యవంతుఁడు—కల్యాణి.

ఓరి తులువా - యిటు రమ్మికి॥ ఓ॥
ఈశరమునన్ - నీశిరము - ధరను -బడగా -నరగున జేసెద॥ ఓ॥
మున్ను రాజ్యముగొని - వనములకు మము - బంచితి వది
చాలక - యిప్పు డరుదెంచిన నిన్ గూల్చెద - చీల్చెద
వేల్చెదన్॥ ఓ॥

సత్యవంతుడు—కమాచి-

ఆనాడు-వనిలోన-గాంచిన-పూబోడి-నీనాడు మరలగంటిగా॥ఆ॥
ఈమె - యిటకు చనుదెంచుట కేమి కతమొ
నామానస మతి సంతోష మగ్న మయ్యె॥ ఆ॥

ద్యుమత్సేనుఁడు—జంఝూటి.

ఇటురమ్మా నరపాలా॥ ఇ॥
పటుతర సౌఖ్యశ్రీల నందుచు - బాలించి పుడమి - నేటికి
సంకటముల నందుచు నుంటిని॥ ఇ॥
రాజాధిరాజునయ్యు విరాజితలీల నిను
బూజింప లేనయితిని - తగినవిధమున॥ ఇటు॥

అశ్వపతి

చింతిలకయ్యా - నీవు - స్వాంతమునందున॥
వంతలెవరికైన తప్పవు - మును భూకాంతు లెందరిటు

చింతల జెంది - పిదప సౌఖ్యవంతులైరి॥ చిం॥
కలిమి లేములు - కావటికుండల వంటివని
తలపుము నీమదిని - లలితచరిత॥ చిం॥

అశ్వపతి - పీలు—రూపకము.

సావిత్రివరమున - జన్మించెను నాకీబాల ।
భూవర దీనిని - కోడలుగా గొనుమా గుణశీల॥ సా॥
రాజపుత్రినని రాజసమూనక - రహిమీకుక్
పరిచర్యలు సేయుచునుండును - భక్తిని నెలమిన్॥ సా॥
సత్యవంతునే - మానసమున గోరిన సుదతీ
నిత్యము నాతనినే - స్మరియించెడు సుమతీ॥ సా॥
వనములనుండి మటంమును - వనటంబొందకుము భూపా
కలిమి లేములు - కావటికుండలు - కులదీపా॥ సా॥

ద్యుమత్సేనుడు - కమాచి—ఆదితాళము.

నృపతీ వినుమా - నామతి॥ నృ॥
ఆగర్భశ్రీమంతురాలు - ఎండకన్నెరుగదు
కానలయందుండునే - ఆకు లలములు భక్షించునె
నారచీరెల దాల్చునె - దర్భశయ్యల మేనుజేర్చునె॥ నృ॥

సత్యవంతుడు.

భళిభళి - నాజన్మము - సఫలతజెందెను॥ భళి॥
కలికిమిన్నను - నాకొసగగ - యీభూ
తలపతి యనుమెంచెను॥ భళి॥
నాడు వనిని చూచిన - నాటనుండియు పూ
బోడిపై హృదయము జిక్కిన యందుకు,
నేడు నాకోరిక దీరెను॥ భళి॥

సావిత్రి - సురట—రూపకతాళము.

ధన్యనైతిని జగ - న్మాన్యనైతిని॥
ఏనుకోరిన సత్యవంతునే - గైకొన గంటివి

కోరికనఫలంబయ్యెను - కుతూహలమునందుము॥ ధ॥
ఈతనిగొనిన భాగ్యమె భాగ్యము
పతిపదసేవ సేయుచు - దరియించెద॥ ధ॥

సావిత్రి - మోహన—ఆదితాళము.

మనోనాథ వనికి - ననుంగూడ గొనుమా॥ మ॥
నినుగూడి నేవచ్చెద॥ మనో॥
అదియేమొ నినుబాయ - మది యొప్పకున్నది నేను॥ మ॥
ననమలాండ నాముద్దు - నమ్మతి చెల్లింపుమా॥ మ॥

సావిత్రి - శంకరాభరణం.

వనవిచిత్రములఁ గనగా - మనమున కోరికయయ్యెఁ॥ వ॥
వలదని పలుకగ - గొని పోమ్మా వారిజనేత్రా - సుగుణచరి
త్రా - ధీజనమతిపాత్రా॥ వ॥

సత్యవంతుడు - ముఖారి—ఆదితాళము.

వలదు వలదు కలికి - వనికిరా నీవు॥
ఉపవాసంబున మది - నెంతయు డస్సితివి
పదు గైనఁ వనిలో - నిడగఁ జాలవు॥ వ॥

సావిత్రి - ముఖారి—రూపకతాళం.

నీపదసేవయు - శ్రీపతిసేవయు జేసెడినాకుఁ
ఉపవాసశ్రమ కల్గునే - యూహింపుము మదిని
ఆవిపినంబంతయు - తరులతరలచే
దీపించునటంచును వింటిని - దోడ్కొని పొమ్మా॥ నీ॥

సత్యవంతుడు—కమాచి.

కనుగొనుమా రమణీమణి యీవనరమణీయత॥ క॥
కనులలరగ - దట్టంబుగ నల్లుకొనిన ఘనలతలఁ
మనమున కుల్లసము గొలిపెడు వలవిటపంబుల్॥ క॥

చెంగు చెంగునదాటుచు కురంగంబుల్ - వానికా
భంగము నొందింపగ బరువెత్తెకి వ్యాఘ్రంబుల్॥ కను॥

సత్యవంతుడు-నీలాంబరి—ఆదితాళము.

భరియింపఁగజాల - నాతలబాధ - పడతీ॥
కన్నులు గానరావు - మిన్నుగనబడదు
కరములు లాగెడి - దేహము వడకెడి
ధ్వనివినిపించదు - కంఠము సన్నగిలె
నోటమాట రాదు - తలపోటధికమాయె॥ భ॥

సావిత్రి - కాంభోజ—అటతాళము.

హా రమణా - నన్నుబాసిపోతివా - నన్నుబాసిపోతివా॥
పెండ్లినాటిమాటలెల్ల - మరచితో
అయ్యో - మఱచితో - కుయ్యాలింపవే॥ హా॥
నీవు నన్నుబాసిన - తనువెట్లు నిలచును
నీతలిదండ్రుల - సేవల నెట్లు మఱచితివి॥ హా॥
నారదువాక్యములు - సత్యము లయ్యెను
ప్రాణవిభూనను - పాలించెడి వారెవ్వరు॥ హా॥

సావిత్రి - ఫీలు—ఏకతాళము.

మంమునిచ్చి నా - ప్రాణవిభుని గాచెదవా
పుణ్యపురుషా - నీవెవ్వరవు॥ మం॥
తలబాధ యధికమై - ధరణి నొరగెను
కరుణదలఁచిబ్రోవుమా కలుషరహిత॥ మం॥

యముడు - వసంత—ఆదితాళము.

ప్రాణము గాచెడివాడనుగాను - ప్రాణముతీసెడివాడనె నేను
నేటితోదీరె - నీతనియాయువు
కాలుడనై - గ్రొత్తెకతమున
యితనిజీవముల - హరియింపగవచ్చితి॥ ప్రా॥

సావిత్రి - నాదనామక్రియ.

పోవుచున్నావా _ శమనా! నాపతిప్రాణంబులబాపి॥ పో॥
ఈవిధిగ జేయుగ - నీకును దగునే
భావింపవదేలా _ పడతికి నిది దుఃఖంబని॥ పో॥
సాధుగుణుఁడు - సచ్చరితుండు - సజ్జననుతుఁడు
నాదయితుడు - నీకేమి యొగ్గునలిపె॥ పో॥
పతికిని - పతిలేని - బ్రతుకు క్షితిపయివ్యర్థమనుచు
మతిదలపవదేల - గుణశీలా _ యీబాలకు - దుఃఖము
కలిగింపగనేలా॥ పో॥

సావిత్రి - జంగ్ల.

శమనా _ యిదితగునా - ధర్మముగనుమా॥
ధర్మపురుషుఁడవు _ ధర్మము దెలిసినవాడవు
పతివిరహితనుజేసి - యధర్మవర్తివగుదువే॥ శ॥
సుగుణశీలుడు _ హరిచింతనాలోలుడు
సత్యవంతు నీతని - నరగున నేలుమా॥ శ॥

యముడు - కల్యాణి.

కడదూరం బిటువచ్చి - బడలితివి పడతీ॥
మరలుము - మరలుము - మరలరాడు నీపతీ॥
మర్త్యుల కగోచరముగు - నారూపము
గననోచితి వీవు - సుదతీ॥ క॥
కర్మంబునకై కనువగవక
ధైర్యంబునఁబూనుము - తరుణీ॥ క॥
అగమ్యం బిటపైనుండినమార్గం
బగునే రా తెగింపగ - మగువా॥ క॥

సావిత్రి - అఠాణా.

పతిపదసేవను ధన్యతనంది నా
కతినుకరంబగు నేమార్గంబయినన్॥
ధర్మమూర్తి నీదర్శనమున - ధన్యతనందక
తగునె మరలిపోవగ - నావిభుని విడక॥ పతి॥
పతు లెచ్చట నుందురు - సతులును నచ్చటనే
సతిముదమందుచు నుందురుగా పితృపతే॥ ప॥

యముడు - శహన—ఆదితాళము.

ఇంతిమహిమ యద్భుతమ్మునించెగా
యద్భుతమ్మునించెగా - మాహాత్మ్యంబునించెగా॥
యసిపత్రవనముదాటి - వైతరణితరించెను
నాలోకంబున కరుదెంచెను॥ ఇం॥

యముడు - కళ్యాణి.

ఇద్ధ్రితిరమణీ - చచ్చెర నీపతిప్రాణములు - మెచ్చువచ్చె నీన
చ్చరితమునాకు॥ ఇ॥
అఖిలజీవుల - కంతకుడనై - దనరెడినాకే భీతిగొల్పితివి॥ ఇ॥
సద్గుణవంతుడు - సత్కళవంతుడు
శాశ్వతజీవియై - బరగును భూమిని॥ ఇ॥
భాగ్యభోగములందుచు - సంతతిగాంచి
రాజిలగల డిక - రమణీయ "కల్యాణి"॥ ఇ॥

యముడు - హిందూస్థానికాఫి—ఏకతాళం.

విరిబోణి-నిను నుతిసలుపగ, నాతరమే
ణించుచు నుంటిన్॥
నీదగుచరితము - మోదముగూర్చెన్
సాదరమతి నీగతి - నాధునిబ్రతికించిన
సారసాక్షి నెందు గాంచనైతిన్॥ వి॥

సావిత్రి - భైరవి—ఆదితాళము.

ఇదవ్రిఞతి - గౌతమ - మందమున - నేనెఱఁగద ధర్మపుగాషా
గతించిన - పతిని - బ్రతికించితి వీ
క్షితి నినుబోలిన - సతికలదే॥ ఇ॥

మంగళహారతి - మోహన—ఆదితాళము.

సారహారతీ - గైకోర - శ్రీపతీ
ధీర - నందకుమార - దనుజవిదార - సువిచార॥ సా॥
గోపికాలోలా - సందీపిత - సుశీలా
పాపహర యదుదీప - గతసంతాప - సుకలాప॥ సా॥
పక్షిరాడ్గమనా - సురపతూ రిపుమతనా
రతీ - కమలదళాక్ష - దనుజవిపతూ - శ్రీపతూ॥ సా॥
సామగానలోలా - ధర - సీతారామయపాలా
భీమానజప్రియకామా - సుగుణస్తోమా - నుతనామా॥ సా॥



కాకినాడ. ఆల్బర్టు పవర్ ప్రింటింగువర్క్సునందు ముద్రింపబడియె.

| | |
|---|---|
| పాండవవిజయం డిటో | 0-12-0 |
| పాండవాశ్వమేధము డిటో | 0-12-0 |
| అహల్యాశాపవిమోచనం | 0-12-0 |
| కాంతామతి డిటో | 0-12-0 |
| సంపూర్ణరామాయణం కో. వ. | 1-4-0 |
| ఫాలాఫ్ విజయనగర్ శ. రా. | 0-12-0 |
| కాంతామతి గూ. కో. | 0-12-0 |
| మహాభారతము సం. శిం. | 1-4-0 |
| చింతామణి రా. నా. | 1-0-0 |
| ద్రౌపతీవస్త్రాపహరణం డిటో | 1-0-0 |
| తులసీదేవి మ॥ వెం॥ | 1-0-0 |
| సావిత్రి హరికధ అ॥ నా॥ | 0-12-0 |
| కంఠాభరణము పా॥ ల॥ | 1-0-0 |
| ఊర్వశీశాపవిమోచనము అ॥ సు॥ | 1-0-0 |
| గులేబకావలి డిటో | 1-0-0 |
| జయచంద్రచంద్రరేఖావిజయం | 0-10-0 |
| షగణ బకావలి డిటో | 1-0-0 |
| సంహారిణి దా॥ పు॥ | 1-0-0 |
| ప్రహ్లాద శే॥ రా॥ | 1-0-0 |
| శివాజీవిజయము డిటో | 1-0-0 |
| సత్యహరిశ్చంద్ర కా॥ పీ॥ | 0-12-0 |
| మహానంద కో॥ స॥ | 0-12-0 |
| దుర్గావతి నం॥ తి॥ | 1-0-0 |
| సంగీతస్త్రీసాహసం చ॥ సూ॥ | 0-12-0 |
| భూలోకరంభ డిటో | 1-0-0 |
| స్త్రీసాహసము వెం॥ వెం॥ | 0-10-0 |
| సాత్రాజితీయం బ॥ ల॥ | 0-14-0 |
| బుద్ధిమతీవిలాసము డిటో | 1-0-0 |
| సత్యహరిశ్చంద్రీయం డిటో | 1-2-0 |
| రుక్మిణీకల్యాణము జి॥ జా॥ | 1-0-0 |
| రంగరాయకదనసమవాకారంకాసా | 1-0-0 |
| ప్రసన్నయాదవము | 0-6-0 |
| గయోపాఖ్యానము | 0-8-0 |
| చతురచంద్రహాస | 0-8-0 |
| శ్రీకృష్ణరాయభాగం చ॥ సూ॥ | 0-12-0 |
| బొబ్బిలియుద్ధం శ్రీ॥ కృ॥ | 1-0-0 |
| సత్యహరిశ్చంద్ర | 1-0-0 |
| సంగీతసావిత్రి | 1-0-0 |
| సంగీతప్రహ్లాద | 0-12-0 |
| ప్రమీలార్జునీయం ద్రో॥ శ్రీ॥ | 0-8-0 |
| శ్రీకృష్ణరాయభారం శ॥ రా॥ | 0-12-0 |

## హాస్యరసపు గ్రంథములు.

| | |
|---|---|
| హాస్యపుపాటలు | 0-6-0 |
| శ్రవణానందం | 0-4-0 |
| శృంగారచాటుపద్యములు | 0-4-0 |
| గొల్లరత్తి | 0-4-0 |
| రంగసాని | 0-4-0 |
| వైరాగ్య చింతామణి | 0-4-0 |
| సుబ్బిశెట్టిదివాళీ | 0-4-0 |
| బటాచోరు బ్రాహ్మడు | 0-4-0 |
| రామదాసు బంధఖాన | 0-4-0 |
| బెజవాడగుంట | 0-2-0 |
| నారాయణమ్మ నాయుడుబావ | 0-2-0 |
| నారాయణమ్మ పాట | 0-2-0 |
| ముద్దులమోహనాంగి | 0-2-0 |
| వేశ్యామృతము | 0-2-0 |
| నిరుద్యోగిఫార్సు | 0-2-0 |
| స్త్రీలసాహసము | 0-2-0 |
| తమాషావిచారము | 0-2-0 |
| కారణంలేనికంగారు | 0-2-0 |
| తల్లికిమొగుడు | 0-2-0 |
| అడంగుల మీటింగు | 0-2-0 |
| మాదాకవళంమల్లాయ | 0-2-0 |

ఇంకను యితరగ్రంథములు వలయువారు ఈక్రిందిచిరునామాకు వ్రాసిన బడయగలరు.

రంగా వెంకటరత్నం,
బుక్కుసెల్లర్సు, బెజవాడ.



వైద్యపుస్తకములు, నాటకములు, వేదాంత పుస్తకములు, హరికథలు, ప్రబంధములు, జ్యోతిషపుస్తకములు, శతకములు, దండకములు, నవలలు, హాస్యపుస్తకములు, యింకా అనేక విధములు గల పుస్తకములు మాదగ్గరను కలవు. నేఁడే కార్డు వ్రాయుఁడు.

రంగా వెంకటరత్నం,

బుక్కు-సెల్లర్సు, బెజవాడ.



